# ద్రౌపదీ వస్త్రాపహరణము.

(ఐదంకముల నాటకము)

గ్రంథకర్తలు

## రామనారాయణ కవులు



ప్రకటనకర్త:

బెజవాడ, శ్రీ సీతారామాంజనేయ కంపెనీ ప్రొప్రయిటరు,

పోలిశెట్టి రామయ్య.

బెజవాడ:

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల, లిమిటెడ్.

 1922. [వెల 1—0—0

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.



పురుషులు.

| | |
|---|---|
| ధర్మరాజు<br>భీముఁడు<br>అర్జునుఁడు<br>నకులుఁడు<br>సహదేవుఁడు | } పాండవులు. |

నారదుఁడు—మునీంద్రుఁడు.

శ్రీకృష్ణుఁడు—ద్వారకాపురాధీశుఁడు.

శిశుపాలుఁడు—శ్రీకృష్ణుని విరోధి—చేదిపతి.

భీష్ముఁడు—కురువృద్ధు

ద్రోణుఁడు—కురుపాండవుల శస్త్రగురుఁడు.

దుర్యోధనుఁడు—కురురాజు.

దుశ్శాసనుఁడు—దుర్యోధనుని తమ్ముఁడు.

కర్ణుఁడు—దుర్యోధనుని మిత్రుఁడు

శకుని—దుర్యోధనుని మేనమామ

విదురుఁడు—ధృతరాష్ట్రుని మంత్రి

ధృతరాష్ట్రుఁడు—హస్తినాపురాధీశ్వరుఁడు-దుర్యోధనుని త

వికర్ణుఁడు, ప్రాతిగామి మొదలగువారు.

| | |
|---|---|
| కామపాలుఁడు<br>జయంధరుఁడు | } ఇంద్రప్రస్థపురమున బౌరులు. |

స్త్రీలు.

ద్రౌపది—పాండవపత్ని.

# ద్రౌపదీవస్త్రాపహరణము.

—: ప్రథమాంకము :—

1. ప్రార్థనపాట.

[ఇంద్రప్రస్థపురము:—రాజవీధి ప్రవేశము:— కామపాలుఁడు, జయంధరుఁడు చెరియొక ప్రక్కనుండి]

కామ— 2 పాట.

జయం—కామపాలుఁడా యేమి? వృద్ధుఁడనగుటచేత చూపు తక్కువయినది. ఆగ్రహింపకుము.

కామ—ఎచ్చటి కింతతొందరగాఁ బోవుచుంటివి?

జయం—నాయనా! శరీర మొకరికి నమ్మకొని నిష్పూచీగ నింటియొద్ద సుఖముగా గూర్చుండుటకు వీలుచిక్కునా? మహారాజుగారి కొలువునకే పోవుచుంటిని. వేళ మించినట్లున్నది నేను తొందరగాఁ బోవలయును.

కామ—జయంధరా! నిను శ్రమయిచ్చినందుకు క్షమింపుము. నేనీమధ్య నాలుమాసములనుండి నగరములో లేకుండుటంజేసి, విశేషము లేమియుఁ దెలియుట లేదు. మన యింద్రప్రస్థపురంబు మహావైభవముగా నలంకరింపఁబడుటకుఁ గారణ మేమో యెఱుఁగవచ్చునా?

జయం—మహోత్సవమంతయుఁ బూర్తియైనపిదప వచ్చినన్నడిగిన నేమని చెప్పగలను?

కామ—ఏమి మహోత్సవము?

జయం—మయసభాప్రవేశ మహోత్సవము.

కామ—మయసభ యేమో- ప్రవేశమహోత్సవ మేమో నాకేమియుఁ దెలియదు. శ్రమవహించి యాసంగతిఁ దెలిపి నాకు శ్రవణానంద మొనర్పుము.

జయం—ఇదియంతియుఁ జెప్పుచు నిచ్చటనుండిరనేని యథకారులవలన నేమిమాట వచ్చునోకదా. అయినను నీ వడిగితివికావునఁ జెప్పెదను. ఖాండవవనదహన సమయమున నర్జునునిచే రక్షింపఁబడిన మయుఁడు ధర్మనందనుని సన్నిధికి వచ్చి "యుధిష్ఠిరభూపాలా! నన్నీపార్థుండు కృపాంతరంగుఁడై రక్షించినాఁడు. ఉపకారమొనర్చినవారికిఁ బ్రత్యుపకారముసేయుట ధర్మము. మీకిద్దియేని నాయోపిన ప్రియంబుసేయఁ గుతూహలముగనున్నది. నేను వివిధశిల్పకలాకుశలుఁడ. అనుమతి యిచ్చితివేని మీయిష్టమైనదానిని నిర్మించెద" నని పలికెను.

కామ—కృతజ్ఞతయనునది మయునియందు సార్థకమగుచున్నదే!

జయం—మయుని పలుకులువిని యాసమయమున నక్కడనున్న శ్రీకృష్ణుఁ డాతనిం గాంచి "మయుఁడా! నీయుపకారమున కెంతయు సంతసించితిని. ఈయుధిష్ఠిరుఁడు నిరంతరసత్యవ్రతాచారధురీణుఁడును, నానారాజకిరీటాలంకృత పాదసరోరుహుండును, నైయున్నాఁడు. ఈమహారాజున కొక్కయపూర్వమైన సభను నిర్మించి యిమ్ము" అనిపలికెను.

కామ—వాసుదేవునకుఁ బాండవులయం దధిక ప్రేమ.

జయం—శ్రీకృష్ణునివాక్యంబుల ననుసరించి, మయుఁడు, వజ్రవైడూర్యమరకతమాణిక్యములచేతను, నింద్రనీలమణులచేతను, నొక్కదివ్యసభను నిర్మించి యిచ్చెను. ఆసభఁజూచుటకు మనకిరెండుకన్నులు చాలవు. ఆసభాగారంబున నాతఁడు నిర్మించిన యుద్యానవనంబులును, సరస్సులును, మొదలుగాఁగల చిత్రంబులు దేవలోకమునందైన లేవని చెప్పుకొనిరి. ఆమయుఁడు, పూర్వము వృషపర్వుఁడను దైత్యేంద్రున కొక యపూర్వసభను నిర్మింపఁదలఁచి యందులకుఁగావలసిన సామగ్రియంతయు బిందుసరోవరంబున దాచి యుంచెనట. ఈతఁ డాసామగ్రిచే నీసభను జేసెను. మయుండు ధర్మనందనున కీసభనొసంగుటయేగాక, భీమునకొక గదయు, నర్జునునకు దేవదత్తమను శఖంబొకటియు నొసంగెను. ఆసభాప్రవేశమహోత్సవ మతివైభవముగా జరుపఁబడెను. తన్మహోత్సవమునకనేకరాజులరుదెంచి ధర్మజునకుఁ బెక్కుకానుక లొసంగిరి. అందుచేతనే పురమీరీతి నలంకరింపఁబడినది.

కామ—నాకన్ను లెంతపాపము జేసికొనెనో నేనా మహోత్సవసమయమున లేకపోయితిని. పోనిమ్ము. నే నిప్పుడైన నాసభను గన్నులారఁజూడవచ్చునా?

జయం—నావెంటరమ్ము. నీకోరికఁదీర్చెద.

(ఇరువురును నిష్క్రమింతురు)

రంగము:—(ఇంద్రప్రస్థపురము-సభామందిరమునధర్మరాజు, తమ్ములు, నారదుఁడు.)

ధర్మ—మునీంద్రా! 3 పాట.

నార—(ధర్మరాజును జూచి)

సీ. కుశలమే కద నీకు! ♦ శశివంశాళిపాదాబ్జ
మకరందరసపాన ♦ మత్తచిత్త
ఆనందమే కద! ♦ నానాధరాపాల
మస్తకమణిదీప ♦ మహితపాద
క్షేమమే కద నీకు! ♦ శ్రితజనబృందసం
రక్షదక్షతా ♦ దక్షతేజ
ఆరోగ్యమా నీకు! ♦ వీరభారతవంశ
పాథోధి సంపూర్ణ ♦ వారిజారి

తే. గీ. భద్రమే కద, నిరత మ ♦ హేంద్ర శౌర్య
సాహసబలప్రతాప వి♦ శాలురగుచు
వెలుఁగు నీదుతమ్ములకును ♦ వినఁగఁదలఁతు
సర్వసమవర్తి ధర్మజ ♦ చక్రవర్తి.

ధర్మ—మహాత్మా! నీ కరుణావిశేషమున మేమందఱమును సుఖముగనే యుంటిమి.

మ. కరుణామూర్తివి నిర్దయుండవు తపో ♦ గణ్యుండవుర్ బ్రహ్మనుర్
వరపుత్రుండవు లోకపూజ్యుఁడవు దే ♦ వ స్తవ్య తేజుండ వీ
వరయన్ నన్నుఁ గృతార్థుఁజేయఁగను మ ♦ ద్భాగ్యంబునన్ వచ్చి త
త్పర భాగీరథిఁబోటినేలవయి న ♦ ర్థిన్ బారు చందంబునన్.

ఉ. నీవు మహానుభావుఁడవు ♦ నిర్మల ధర్మవివేకశీలస
ద్భావము నీదుసొమ్ము నను ♦ ధన్యునిఁ జేయఁగనెంచి యిట్లు మో
దావహమానసంబునను ♦ దాపసకుంజర! వచ్చినావు; ని
న్నేవిధిఁబూజసేయఁగల ♦ నేమి యభీష్టము తెల్పుమీ కృపన్.

నార—ధర్మనందనా! నావంటిమునీంద్రుల కేమికోరికలుండును? ధర్మవ్రతుండవగు నిన్నుఁ జూచు కోరికతప్ప మఱేమియుండును?

సీ॥ అచలశిక్షణదక్షుఁ ♦ డతని దర్పమదేల,
బలహాననమునఁ దో ♦ ద్భాటుఁగోరి

అచల భేదనదక్షుఁ ♦ డతని శౌర్యమదేల,
దానవాబలల సూ ♦ త్రములు దెంచె
అచల హారణదక్షుఁ ♦ డతని విక్రమమేల,
పుణ్యజనచ్ఛేద ♦ మునఁ జెలంగె
అచల పాలనదక్షుఁ ♦ డతని శౌర్యమదేల,
జలధిలంఘనమున ♦ సాహసించె

తే. గీ. ననుచు నిందాదికుమార రా ♦ మాంజనేయ
విఖ్యాతిహాసియుంచి భవదీయ ♦ విక్రమంబ
వక్రగతి మించియుంటకు ♦ భావమందు
సంతసించితి ధర్మజ ♦ చక్రవర్తి.

సీ॥ శాంతుఁడై వైరిదు ♦ ర్దాంతుఁడై శ్రితమనః
కాంతుఁడై సూర్యు వి ♦ భ్రాంతుఁ జేసి
శ్రీదుఁడై సుజనస ♦ మ్మోదుఁడై సురభూజ
వాదుఁడై శిబిని నిం ♦ దాదుఁ జేసి
సారుఁడై ధృతసర్వ ♦ భారుఁడై విశ్వలో
కారుఁడై ధారుణి ♦ మేరనడచి
శుభ్రుఁడై పరిపూరి ♦ తాభ్రుఁడై వాక్సుధా
దభ్రుఁడై శరదభ్ర ♦ సారమడచి

తే. గీ. సకలభూపాలకాగ్రణుల్ ♦ సంతసంబు
భక్తిఁ బూని సేవింపఁగ ♦ భవ్యమతిని
నేలుచున్నాఁడవంట మ ♦ హీతలంబు
సాధుపథవర్తి ధర్మజ ♦ చక్రవర్తి.

ధర్మ—సంయమివర్యా ! ఇది యంతయు మిముబోంట్ల యాశీర్వచన ప్రభావమే! నేను నీకిరుణకుఁ బాత్రుడనే గాని వినుతికిఁ గాదు.

నార—ధర్మతనూభవా! నీ రాజ్య పరిపాలనంబునుఁ గూర్చి కొన్ని విశేషంబుల నడుగఁ దలంచితిని.

ధర్మ—మునీంద్రా! ఆనతిమ్ము.

నార—యుధిష్ఠిరా! రాజకార్యంబు లొనర్చుటకు యోగ్యులయినవారినే నియోగించితివికదా! రాజులకెప్పుడును మంత్రింబై యొప్పు జయంబును గాపాడుచుంటివా?

సీ. ధర్మంబునందె చి ♦ త్తంబు నిలిపియేలు
చుందువె పుడమి నా ♦ నందమెసఁగ
ధర్మంబులరసిన ♦ ధన్యగుణులు నీకు,
మంత్రులైయుందురే ♦ మాన్యచరిత
వివిధశాస్త్రజ్ఞాన ♦ వేత్తయై యొప్పునే,
నీ పురోహితుఁడిల ♦ భూపవరా!
శరణన్న వారికి ♦ గరుణారసముఁబోసి,
రక్షింపుచుందువే ♦ రాజచంద్ర

తే॥ గీ॥ జ్యౌతిషికులు నీసభలోన ♦ నలరుచుండ్రె
భక్తి విశ్వాసములను సే ♦ వకులు బూని
నిన్ను సేవింపుచుందురె ♦ నన్నెమీఱ
వినఁదలంచితి గావున ♦ వేడ్కఁ జెపుము.

ధర్మ—తాపసవర్యా! నాయొద్దనుండినవారు నీవు వచించినతెఱంగున నున్నవారని చెప్పుట కెంతయు సంతసించుచున్నాను.

నార—సంతోషము. చౌర్యగుణంబులుగలవారిని, ధనమునం దతియాశ కలిగిన వారిని, శత్రుపక్షము బోననెంచిన వారిని, రాజకార్యాలోచనలయందు నియమింపవుకదా?

ధర్మ—దేవా! స్వామిభక్తిపరాయణులని నమ్మినవారినే రాచకార్యములయందు నియోగింపుచుందును.

నార—రాష్ట్రముపై నీకువచ్చు రాబడియందు మూడవపాలుగాని లేక యరపాలుగాని వెచ్చింపవలయునుగాని, మిక్కిలి యెక్కుడు వెచ్చింపఁగూడదను సంగతి నీవు గ్రహించితివా? ఎట్టిశత్రులైనను శరణుఁబొందిన రక్షింతువుకదా? చోర భయంబు లేకుండ రాష్ట్రంబుఁ బాలింతువా? రణపటిష్ఠులగు వారిని భవత్సేనల కధ్యక్షులుగాఁ జేసితివే? భవదీయాజ్ఞాబద్ధులై మెలంగుచు, వైరిరాజుల శిక్షింపఁబంచి, వారివల్లధనంబుఁగొనుచు, నీకుపకారంబు దలంపక, భక్తి విశ్వాసములు గలిగియున్న భటులుండిరా? నిర్ణయకాలమునకు భవదీయసేవకులకు జీతంబు లిచ్చుచుందువే? నీకంతంబున రణంబుననీల్గిన వీరుల కళత్రపుత్రాదులను బోషించుభారము బూనియుంటివే? సకల నృపాలురును నిన్ను వినుతి సేయునట్లు గురుజనంబులను నాశ్రితులను, బాంధవులను, భక్తులను, బేదఱికంబు నొందకుండఁగా పాడుదువే? విద్వజ్జనంబులు బురాణేతిహాసములఁ జెప్పిన

వాని నాదరబుద్ధితో విందువుగదా? నీసభాగారము కవిగాయకశిఖామణులచే నిండియుండునుగదా? నీచే రక్షింపఁబడు దుర్గములు శత్రువులు ప్రవేశించుట కభేద్యములై, గొప్ప జలయంత్రములు గలిగియుండి, వీరభటులచే రక్షితములగుచు నొప్పుచుండునా? ఆయా దేశంబులవార్తలఁ దెలుపఁదగిన వార్తావహు లుండిరికదా!

ధర్మ—నారదమునీంద్రా! నాయథాశక్తిచే రాజ్యపరిపాలనంబున నేకొఱంతయుఁ గలుగకుండఁ జూచుచుంటిని.

నార—అదియే కావలసినది.

ఉ. కామితదాయివై బుధని ♦ కాయము మోదమునంద సద్యశ
స్తోమము సర్వలోకముల ♦ శోభితమై దనరారి పావనం
బై మిహికామరీచిరుచి ♦ భంగి మనోహరలీల ధాత్రి ని
చ్చామతి నేలుచుండు మదె ♦ సర్వశుభంబులఁగూర్చు ధర్మజా.

ధర్మ—మహాత్మా! నీయాజ్ఞ మౌళింధరించెదఁగాక!

నార—దైవబలముగలిగి విలసిల్లు నీ కేకొఱంతయుఁ గలుఁగదు. కాకున్నచో మయసభాప్రాప్తి సామాన్యమైనదా? ఇంద్ర యమవరుణ కుబే రాదులసభలఁ జూచితినిగాని, యిట్టి యపూర్వ నిర్మాణమెచ్చటను జూడలేదు. మయ సభాప్రాప్తింగూర్చి స్వర్గంబుననున్న మీతండ్రియగు పాండురాజువిని యెంతయో సంతసించెను. మయసభాప్రాప్తికిఁ దగినట్లు నీచే రాజసూయమహాధ్వరము సేయింపుమని యాతఁడు నన్నుఁ గోరెను. నారాక యందులకే కారణము.

తే॥ గీ॥ సత్యమూర్తివి నరపాల ♦ సమితియందు
గడుఁ బరాక్రమశాలురై ♦ గ్రాలునట్టి
సోదరచతుర్థముంగల్గి ♦ శోభఁగాంచు
చున్న; నీదు సౌభాగ్యంబు ♦ నెన్నవశమె?

రాజసూయముసేయుట కీవయర్హుండవు.

ఉ. కావున రాజసూయమును ♦ గ్రన్ననఁ మోదముతోడఁజేసి లో
కావళిలోనఁ గీర్తిఁగొని ♦ క్ష్మాతలనాయకచంద్రులెల్ల నీ
సేవలఁజేయ నొప్పుచును ♦ శిష్టులుమెచ్చఁగఁ జక్రవర్తివై
భూవలయంబునందుఁ గడు ♦ బొల్చువహింపుము ధర్మనందనా!

ధర్మ—మునీంద్రా! అసమర్థుఁడనగు నేను రాజసూయమెట్లు సేయఁగలను? అ
యయ్యధ్వరంబన్న సామాన్యమైనదికాదు.

మ. మునిచంద్రా! యిపుడానతిచ్చినది స ♦ మ్మోదంబె; యద్దానికిన్
ధనమెంతోఁ గరమందు నుండవలెఁగా ♦ దా! యట్టిచో నెట్టులీ
ఘనయాగంబొనరింపఁగల్గుదు వృథా ♦ కాంక్షించఁగానేల; ని
ర్ధనుఁ డేకార్యము సేయఁజాలఁడుగదా ♦ తథ్యంబు యోచింపుమా.

నార—యుధిష్ఠిరా! ఇదియా, నీకుఁగలిగిన సందేహము!

సీ. హరియైన వసుదేవ ♦ వరసూతి మీకు ర
క్షకుఁడయి సతతంబుఁ ♦ గాచుచుండె
వీరాధివీరులై ♦ వెలుఁగొందు సోదరుల్
నలువురునిన్ గొల్త్రు ♦ లలితభక్తి
ధర్మవ్రతమె నీకుఁ ♦ దనరారుదివ్య భూ
షణమంచు దలతువు ♦ స్వాంతమందు
సకలభూనాయక ♦ చక్రంబునందున
ఘనమైన యశమునుఁ ♦ గాంచినావు

తే. గీ. అట్టిచో నీవు రాజసూ ♦ యాధ్వరంబు
సేయుటది యెంతకార్యంబు ♦ చిత్తమందు
శంకవిడిచి యత్నంబును ♦ సలుపుమయ్య
సద్గుణలలామ! ధర్మజ ♦ సార్వభౌమ.

4 పాట.

చ. వరసభఁగాంచినావు నృప ♦ వర్యులు సంతసమందునట్టు లీ
ధరణీతలంబు నెంతయును ♦ ధర్మముదప్పక నేలుచుంటివిం
క రహించి రాజసూయమును ♦ గ్రన్నన జేసి యశంబుగాంచుచే
కోరతగనున్న దయ్యది య ♦ కుంఠిత లీలనొనర్పఁగావగున్.

శ్రీకృష్ణుని కరుణకుఁ బాత్రుఁడవైన నీకావంతయుఁ గొఱంత సంభ
వింపను? అదియుంగాక.

చ॥ నలువురుతమ్ములున్ భువిని ♦ నాలుగుదిక్కులకేగి సంగర
స్థలమున రాజవీరులను ♦ శౌర్యపరాక్రమ ముల్లసిల్లఁగా
దలపడియైనఁ దెచ్చెదరు ♦ ద్రవ్యము నీ యజనార్థమై; ధరా
తలపతి! సంశయింపక మ ♦ దంబున యత్నముసేయుమా! వెసన్.

భీమ——(ధర్మరాజునుఁజూచి) పరాక్రమవంతులగు నలువురు తమ్ములగలిగినవాఁడవైన నీవేల యిక్కార్యమునకు సంశయించెదవు?

తే॥ గీ॥ ధర్మసుతుఁడు జేసెడి మఖా ♦ ర్థంబు ధనము
వలయునంచును గోరిన ♦ భవ్యమతిని
నేనృపాలచంద్రుండు దా ♦ నిడక యుండు
నుండుఁగాక! బలములేదె ♦ యుర్వితేఁడ.

అర్జు——

మ॥ అనఘా! చిత్తమునందు సంశయమదే ♦ లా! రాజసూయార్థమై
ధనమిమ్మంచును రాజచంద్రులను మో ♦ దంబారగా వేడెదన్
ఘనసంతోషముతోడ నిచ్చిన సరే? ♦ గాకున్న; సంగ్రామమం
దున దర్పంబునుమాపి ద్రవ్యమును దో ♦ డ్తోగూర్తునే యేటికిన్.

నకు——

చ. అనుపమ సాహసంబునను ♦ నద్భుతమందఁగఁజేసి భూపులన్
ఘనకుతకంబుతోడను మ ♦ ఖంబునకున్ ధనమిచ్చి నీకు మ్రొ
క్కునటులఁజేసెదన్ వినుమ ♦ కుంతితలీలను! సంశయింపకే
జనవర రాజసూయమును ♦ సల్పి యశంబునుగొమ్ము ధారుణిన్.

సహ——

మ॥ భవదీయానతిఁబూని నే నరిగి మ ♦ ద్బాహాబలప్రౌఢి; భూ
ధవులన్ గెల్చుచు రాజసూయసవనా ♦ ర్థంబై ధనంబెంతయున్
భవుక ప్రీతినిదెచ్చి నీకిడెద భా ♦ వంబందు శకింప కో
యవనీపాల కిరీటదీపితపదా ♦ భ్రాతద్వయా! ధర్మజా.

నార——(ధర్మరాజునుజూచి) ధర్మనందనా? ఇట్టి బలపరాక్రమవంతులగు తమ్ములుండఁగా నీకేమికొఱంత. శీఘ్రంబుగ రాజసూయసవనమునకై యత్నింపుము. పోయివచ్చెద.

ధర్మ——మునీంద్రా! దయయుంచుము.

నార——(నిష్క్రమించును) (తమ్ములతోనమస్కరించును)

ధర్మ—(తమ్ములనుచూచి) తమ్ములారా!

ఉ॥ చేయుము,రాజసూయమని ♦ చెప్పెనునారదమౌని దానినిన్
జేయఁగ గోర్కెయుంగలిగెఁ ♦ జిత్తమునందున నాకుఁగూడ; నా
రాయణుఁడైనమాధవుని ♦ రాజితసత్కృపఁగాంచి యాగమున్
జేయుట యొప్పునింక, బుధ ♦ శేఖరులెల్లరు సంతసింపఁగన్.

మనశ్రేయోభిలాషియగు శ్రీకృష్ణునితో నీసంగతిఁజెప్పి యాతని యనుమతి ననుసరించి వర్తింతము. (అర్జునునిజూచి) అర్జునా! నీవు ద్వారకాపురమునకరిగి వసుదేవనందనునితో నీసంగతిఁ దెలిపి యాతనిం దోడ్కొనిరమ్ము. తమ్ములారా! కాలాతీతమైనది రండు.

(అందఱును నిష్క్రమింతురు)

రంగము:—[ధర్మరాజు సభామందిరము - ప్రవేశము - ధర్మరాజు - భీమార్జున నకుల సహదేవులు - శ్రీకృష్ణుఁడు.]

---

ధర్మ—(శ్రీకృష్ణునిఁ జూచి)

ఉ. చేయుము రాజసూయమని ♦ చెప్పెను నారదమౌని దానినిన్
జేయుట యెట్లొకోయనుచుఁ ♦ జిత్తమునం దలపోయుచుండ నా
రాయణమూర్తి వీవిటకు ♦ రమ్యకృపన్ వహించి యిట్లు వి
చ్చేయుటఁగాంచి సమ్మదము ♦ జెందితి నెంతయు దేవకీసుతా.

కృష్ణా! నారదవచన ప్రబోధితుఁడనై రాజసూయమహాధ్వరంబు సేయఁదలఁచితిని. అందుకొఱకే నిన్నుఁ దోడితెచ్చుట కర్జునునిఁ బంపినాను. నాయందుఁ గృపాంతరంగుడవై శ్రమయని తలంపక విచ్చేసితివి.

మ. భవదీయంబగు సత్కృపారసము మా ♦ పైఁజిమ్ముటం జేసి భా
గ్యవిశేషంబును బొంది భూరమణు లా ♦ హాయంచుఁ గీర్తింప, ని
బ్భువిఁ బాలింపుచునుంటిఁ దమ్ములును సం ♦ పూర్ణానురాగంబుతో
భవుకప్రీతిని సంతతంబునను గొ ♦ ల్వన్ దేవకీనందనా.

శ్రీకృ—యుధిష్ఠిరా! నాయందు నీకున్న యభిమానముచేత నట్లు వచించెదవుగాని నేను మీయెడలఁ జేసిన మహాకార్యము లేవికలవు ?

తే. గీ. జయమునకు మూలమైనట్టి ♦ సత్యధర్మ
దాన గుణములు నీయొద్దఁ ♦ దగిలియుంట
భూపతులయందు మేటివై ♦ బొలిచినావు
కలరె నినుబోలు ధన్యులు ♦ క్ష్మాతలమున.

నారదమునీంద్రుని వచనమెంతయు శ్లాఘనీయము. రాజసూయ మహాధ్వరాచరణంబునకు నీవెంతయు నర్హుండవు.

తే॥ గీ॥ అమరులెల్లరు మెచ్చంగ ♦ నవనియందు
రాజసూయాధ్వరంబును ♦ రహినొనర్చి
భూపతులయందు సత్కీర్తిఁ ♦ బొందిి, చక్ర
వర్తివై విరాజిల్లుమో ♦ భవ్యచరిత॥

ఉ॥ నాలుగు దిక్కులోయనఁగ ♦ నల్వురుదమ్ములు భక్తిఁగొల్వఁగా
బాలనసేయుచుంటివి సు ♦ పర్వులుమెచ్చఁగభూమి; వైరిభూ
పాలుర కన్నులెఱ్ఱవడ ♦ భవ్యసభన్ మయుచేతఁగొంటి వా
హా! లలినిన్నుబోలిన ధ ♦ రాధిపులుండిరె ధర్మనందనా॥
మయుపని చిత్రమైన సభ త్రిలోకవర్ణితము.

ధర్మ—కృష్ణా! నన్నొక పెద్దగాఁజేసి యట్లుపలుకుదువు.

సీ॥ భవదీయకృపగాదె ♦ పార్థుండనలుచేత
నశ్వయుతరథంబు ♦ నందియుంట
భవదీయకృపగాదె ♦ వాయుసూతి మయుచే
వరగదా దండంబు ♦ బడసియుంట
భవదీయకృపగాదె ♦ ఫల్గునుఁడలదివ్య
దేవదత్తంబును ♦ దెచ్చికొంట
భవదీయకృపగాదె ♦ వరమయుదివ్యస
భాప్రాప్తి నాకును ♦ వరలియుంట

తే. గీ. మమ్ము నిరతంబు నీవును ♦ మహితకరుణ
గాంచుచుండుట చేత జ ♦ గంబునందు
సుఖముగా గాలమును గడుపు ♦ చుంటిమయ్య
సందియములేదు దీనికి ♦ నందపుత్ర.

నీవు కృపవహించి యుండకపోయినచో యీ పాండుపుత్రులు పేరును నూరునులేక యుండెడి వారు కాదే!

అర్జు—అన్నయ్యా! నీవు సత్యమును వచించితివి. (కృష్ణునిఁ జూచి) బావా!

సీ॥ కాశికాపురిని లా ♦ క్షాగృహంబునఁ బడి
ప్రాణముల్ బాయక ♦ బ్రతికయుంట
యేకచక్రపురిని ♦ లోకకంటకుఁడైన
యాబకాసురదైత్యు ♦ నదిమియుంట
వీరాధివీరు నం ♦ గారపర్ణుని ఘోర
భండనంబున గెల్చి ♦ బరగియుంట
పృథ్వీశులెవ్వరు ♦ వీఁకుఁవఁగాఁజాలని,
యంత్రరాజముఁగొట్టి ♦ యలరియుంట
తే॥ గీ॥ నీవుకృపఁజూచుటనుగాదె ♦ నిశ్చయముగ
యిట్టిస్థితిగాంచి సుఖముగా ♦ నెసఁగి నిఖిల
రాజమండలంబందున ♦ రమ్యకీర్తి
గాంచఁగా నోచినారము ♦ కమలనయన.

భీము—నందనందనా! బాల్యంబున దుర్మతుండగు సుయోధనుఁడు నన్ను హ్రదంబులోవైచినను, విషాన్నము బెట్టించినను నీకరుణచేతనేగదా సజీవుఁడనై యుంటిని.

నకు—

తే॥ గీ. కౌరవులు మమ్ము వంచింపఁ ♦ గా| దలంచి
పన్నుచుండిన మాయలో ♦ పల మునుంగ
కుండ గాపాడుచుంటివి ♦ కూర్మిమీఱ
నిన్ను వర్ణింపఁదరమా నె ♦ నీరజాక్ష.

సహ—నీవు మమ్ము నిరంతరమును రక్షించుచుండు వాఁడవగుటచేతనే నిన్నుఁ బాండవపక్షపాతియందురు. కృష్ణా మాయందు దయాంతరంగుండవై నారదుఁడు చెప్పినట్లు మాయగ్రజునిచే రాజసూయ మహాధ్వరంబు చేయించవలయును.

ధర్మ—దేవా! ఈకార్యభారము నీభుజస్కంధమునందు వహింపవలయును. నీవు నన్ను దయఁజూడకుంటివేని యేకార్యమును జేయఁజాలను.

శ్రీకృ—ధర్మనందనా! ఇందులకు నీవు సందియ మందెద వేల?

తే. గీ. సత్యసంధత నీకుభూ ♦ షణముగాగ
వెలయుచున్నాఁడ వెంతయుఁ ♦ బృథ్వియందు

రాజసూయాధ్వరంబింక ♦ రహినొనర్చి
యఖిలదిక్తట సత్కీర్తి ♦ నందవలదె.

6. పాట.

నీ వింక రాజసూయముసేయ సమకట్టుము. రాజసూయాధ్వర ప్రారంభమునకుఁ బూర్వమే మనమొకకార్యము జేయవలసియున్నది. భూతలంబున గల రాజన్యులనెల్లర జయించి మగధదేశాధీశ్వరుఁడగు జరాసంధుఁడు మిగుల దర్పించియున్నాఁడు. సకలనృపాలురును భయంబునఁజేసి యాతనిని సేవింపుచుందురు. నేనుకంసుని వధించిన కారణమున నాతఁడు నాకనేకోపద్రవములు గలుగ జేసెను. వానితోడ నాకువైరము బలవంతమై యుండుటచేతనే నేను మధురానగరము విడిచితిని. ఇది యట్లుంచుము. ఆదురాత్ముం డనేకరాజుల బలిమిం జెఱఁబట్టి తెచ్చి, భైరవపూజార్థమై యొక్కొక్కని వధించుచుండును. నీవు వానింగెల్చినగాని నీసామ్రాజ్యము మహోన్నతినంది సుస్థిరముగాదు.

భీము—అగ్రజా! ఈ యదునందనుఁడు వచియించిన మాటనిక్కము. నీవిందులకు శంకింపవలదు. అధికబలదర్పోన్నతుఁడైన వానిని రణమున దాకిజయించుట వీరపురుషలక్షణమే కదా?

మ॥ హరికారుణ్యముగాంచి యర్జునుని సా ♦ హాయంబునుంబొంది, దు
స్తర దర్పోద్ధతుఁడౌ జరాతనయునిన్ ♦ క్ష్మాపాలకుల్ మెచ్చఁగా
సరగన్ గూల్తును సంగరాంగణములో ♦ శౌర్యాతిరేకంబునన్
ధర నీ జేసెడు రాజసూయ సవనా ♦ ర్థంబై ధరిత్రీశ్వరా.

నేనును, నర్జునుఁడును, వాసుదేవుఁడును, దేవ్రతాగ్నుల చందమున వెలుంగుచు జరాసంధుని నగ్నింబ్రేల్చి నీయజ్ఞకార్యము నిర్వర్తింతుము.

అర్జు—అన్నయ్యా! అఖిలధరాపాలురనుజయింపుము. రాజసూయాధ్వరంబొనర్పుము. యశంబందుము. అట్లుగానిచో నాభుజబలమునకుఁ గీర్తిఁదెచ్చిన, యాధనుర్లాభము, రథాశ్వలాభము, మయసభాలాభమును, సఫలత్వము బొందవు. ఇంతియేగాక రాజసూయాధ్వరార్థమై యమ్మాగధునివధించి, యాతనిచే బంధింపఁబడిన రాజులకు జెఱ విముక్తిఁగలుగఁజేయుటకన్న మఱియొక పుణ్యమేమి కలదు.

శ్రీకృ—యుధిష్ఠిరా! భీమార్జునులు లెస్సగబలికిరి. మాగధుని నాయుధయుద్ధమం దెవ్వరును జయింపజాలరు.

ఉ॥ ఆతఁ డనేకయుద్ధముల ♦ యందు నృపాలుర నెల్లగెల్చి; ప్ర
ఖ్యాతినిఁగాంచినట్టి సక ♦ లాస్త్రవిదుం డతనిన్ రణంబులో
శాతశరమ్ములన్ దునుమఁ ♦ శక్యముగాదు: తలంచిచూడఁగా
నాతతబాహుయుద్ధమున ♦ నాతనిఁగూల్పవలెన్ నృపాగ్రణీ.

ఆతనికి శంకరుం డొసంగిన వరప్రభావముచే గర్వించియున్నాఁడు. మన భీముఁడాతనిని మల్లయుద్ధమునఁ దప్పక జయించును. పార్థుని రక్షాబలంబును, భీముని భుజబలంబును నానీతిబలంబును గలుగ నీ కసాధ్యమైన కార్యమేమి యున్నది?

ఉ. సెలవిడిపంపుమీ యిపుడె ♦ చెచ్చెర మేమటకేగి మాగధున్
గలనవధించి నీదు పద ♦ కంజసమీపమునందునుంతు, మా
తులువ శిరంబు భూపతులు ♦ తోరపుమోగము నందునట్లుగా
బిలువగవద్దు నీవుమము ♦ వేరుల నట్టులసేయకుఁడినన్.

భీమార్జున సహితముగా నేనా మాగధునికడ కేగెద గాక!

ధర్మ—కృష్ణా! నీ కారుణ్యముగాంచి వర్ధిల్లుచున్న మాకుఁ గొఱంత యెట్లుకలుగును? నేనెప్పుడును భవదాజ్ఞానువర్తనుఁడనే గదా! వాసుదేవా! నీ వెట్లుచెప్పిన నట్లు చేయుదును. కాని యొక్క విషయమునమాత్రము సందియము కలుగుచున్నది. జరాసంధుడు మిగుల భుజబలపరాక్రమశాలియనియు, శంకర ప్రసాద సంజనిత దుర్వారబలుఁడనియు వచించితివి. ఆతనిని మనము గెల్వఁగలమా? భుజబలసింధుఁడగు జరాసంధుని జననప్రకారము వినఁదలఁతు.

శ్రీకృ—ధర్మతనూభవా! మగధదేశాధీశ్వరుఁడగు బృహద్రథుఁడనువాడు భుజశౌర్యంబునఁ దక్కిన భూధవుల సరకుఁగొనక రాజ్యంబేలుచు గాశీరాజపుత్రికల నిరువురఁ బెండ్లియాడి సంతానము వడయఁదలఁచి యనేకపూజలంజేసి నిష్ఫలమనోరథుఁడై తనయంతరంగమున,

చ. తనయులులేని సంసరణ ♦ దైవనివాసములేని గ్రామమున్
జనపతిలేనిరాజ్యము, ని ♦ శాపతి కాయనిరాత్రి; భర్తఁబా
సినసతి; భూసురార్చనము ♦ సేయనిజన్మము; దేవదేవునిన్
వినుతియొనర్పలేనిమది ♦ పృథ్విని నుండిన నేమిలాభమా.

అని తలఁచి, తపముసేయుట కరణ్యమునకరిగి యచ్చట నొక మహీజము క్రింద జండకౌశికుఁడను మునింగాంచి నమస్కరించి తనకోరికఁ దెలుప, నమ్ము

నీంద్రుఁడు కృపాంతరంగుఁడై యాతనికి సంతతిఁగలుగఁజేయఁదలఁచి భగవద్ధ్యానము సేయుచుండ, నయ్యెడగల సహకారభూజంబునుండి యొకఫలము తన ముందుబడెను. ఆమునీంద్రుఁ డాఫలమునుదీసి, యభిమంత్రించి, బృహద్రథున కొసంగి "ఈఫలంబువలన నీకొకపుత్త్రుఁ డుదయించు" ననిపలికెను. బృహద్రథుఁడు సంతసమంది యాఫలమునుగైకొని నిజనగరంబునకరుదెంచి, యాఫలమును రెండుభాగములుగాఁజేసి యిరువురుభార్యలకును నొసంగెను. వారిరువురును గర్భముదాల్చి పదియవమాసమున నొక్కరేయి, నొక్కకన్నును, నొక్కచెవియు నొక్కహస్తమును గలిగిన వికలస్వరూపులగు నిరువురసుతులనుగాంచిరి. అట్లు వికలాంగులై జనించిన సుతులనుజూచి వారిని రాజునకుఁ జూపనొల్లక భార్యాద్వయము యోచించి దాదులంబిలిచి "యీపుత్త్రిలను నెచ్చటనైన విడిచిరం"డని చెప్పిరి. దాదు లాశిశువులను దీసికొనిపోయి రాజభవనద్వారసమీపంబున నొక్క చదుకంబునొద్ద పారవేసి పోయిరి. అప్పుడచ్చటనున్న జరయనురక్కసి కడురయంబునవచ్చి యాశిశువులనిద్దరిని నెత్తికొని యొక్కహస్తంబుతో నదిమిపట్ట యయ్యిద్దరును నొక్కడేయయ్యెను. రాక్షసి యాకుమారు నెత్తికొనఁజాలక డించిపోయెను. అప్పుడీ బాలకుని రోదనము నంతఃపురస్త్రీలాలించి పరువెత్తుకొనివచ్చి యచ్చెరువంది యాబాలకుని నెత్తుకొనిపోయిరి. బృహద్రథుఁడు నిజపుత్త్రుం దిలకించి యమందానందముందెను. ఆసమయంబున జగబృహద్రథునికడ కరుదెంచి తాను బాలునిరక్షించిన విధము జెప్పెను. బృహద్రథుఁడు ప్రముదితమనస్కుఁడై యయ్యసురను విలోకించి "మునీంద్రుఁడగు చండకౌశికుఁడు కుమారునిదయచేసె. ఇప్పుడ కుమారుని నీవురక్షించితివి. నీవునాకులం బుద్ధరింపనరుదెంచిన పుణ్యదేవతవుగాని రాక్షసివికా"వనిపలికి యాకుమారునకు జరాసంధుఁడను నామంబిడియెను. (ఇంచుక యూరకుండి) ధర్మతనయా! ఇంక మేము ప్రయాణసన్నాహమున నుండవలయును. (భీమార్జునులఁజూచి) భీమార్జునులారా! జరాసంధవధకై మీయన్నగారి యనుజ్ఞయైనది. ఎల్లి సూర్యోదయమున మనమరుగుదము రండు.

(అందఱును నిష్క్రమింతురు)

---

[పర్వతాగ్రము:—శ్రీకృష్ణుఁడు, భీమార్జునులు]

7. పాట

శ్రీకృ—భీమార్జునులారా! ఇదియే గోరథమను పర్వతము. అదిగో! గిరివ్రజపురము. అదియే జరాసంధునిపురము.

అర్జు—బావా! ఆపుర మమరావతిని మఱపించుచున్నదే.

కం. గోపురమై పురములలో
గాపురమై మాగధునకుఁ ♦ గలుములకుఁ సదా
దాపురమై భాసిల్లెడి
యీపుర విభవంబు నెంచ ♦ నేరికిఁదరమా.

శ్రీకృ—అర్జునా! అందలి ప్రాసాదంబుల నిర్మాణ మతివిచిత్రము. గోరథము, ఋషభము, వైహారము, ఋషిగిరి, చైత్యకాద్రియు నను నైదుగిరు లీపట్టణముచుట్టును వీరభటులచందమున నుండును. ఆకారణమున దీనికి గిరివ్రజమను పేరువచ్చినది. గౌతమముని యనుగ్రహమున నీదుర్గమతిబలముగలదై యొప్పుచుండును. ఇందుచేతనే మాగధుని రణంబున నెవ్వరును దాకఁజాలరు. మన మీమార్గమునఁ బురము ప్రవేశింపవచ్చును. కాని ప్రస్తుతము వలనుపడదు. అదిగో! చైత్యగిరి. అచ్చట మూడుభేరులున్నవి. మున్ను మాగధులు మానుసాదంబను ఋషభమును వధించి దానిచర్మముచే దానిని నిర్మించిరి. ఈపురమున నూతన మనుజు లెవ్వరైనఁ బ్రవేశించినచో నాభేరులు తమంతదామే మ్రోగును. మన మిప్పుడచ్చటికరిగి వానినివ్రచ్చి పురమును బ్రవేశింతముగాక! రండు.

(నిష్క్రమింతురు)

---

రంగము:—[గిరివ్రజపురము:—జరాసంధుని మందిరసమీపమున శ్రీకృష్ణభీమార్జునులు ప్రవేశించుచున్నారు]

శ్రీకృ—అర్జునా! ఇదియే జరాసంధుని మందిరము.

అర్జు—వాసుదేవా! నీయంతరంగమున నెట్టియూహలున్నవో యెవ్వారికిని దెలియవుకదా! మాచేత నీరీతి బ్రాహ్మణవేషముల నేలవేయించితివో నీవేలధరించితివో మాకేమాత్రమును దెలియుటలేదు.

భీము—శ్రీకృష్ణుని మాయ లెవ రెఱుగుదురు?

శ్రీకృ—భీమార్జునులారా! ఈజరాసంధుడు బ్రాహ్మణ పూజయు, మునిజనార్చనమును గలిగి విలసిల్లుచుండును. అర్ధరాత్రి సమయమునందైన బ్రాహ్మణులు వచ్చినచోఁ దప్పక పూజించును. (ఎదుటఁజూచి అదుగో! జరాసంధుఁడిల్లే వచ్చుచున్నాడు.

తే॥ గీ. ఇతఁడు పరమేశభక్తుఁడై ♦ యెల్లదాన
ధర్మముల నాచరించుచు ♦ దనరుచుండి
క్షత్రియవధచేఁ బాపంబు ♦ గట్టుకొనుచు
నుండెఁ గాకున్న బెంపుపై ♦ నొందఁదగఁడె
మహితదేవతాలోకసా ♦ మ్రాజ్యలక్ష్మి.

8. పాట.

జరా—(ప్రవేశించి తనలో) చైత్యకాద్రిపైనున్న భేరులు మ్రోగినవి. ఎవరో నూతన పురుషులు వచ్చియుందురు. ఇప్పుడు వినవచ్చినశబ్దము సామాన్యమైనది కాదు. మరల నాధ్వని వినిపింపకపోవుటచేత, నాభేరులను వారు సంపూర్తిగ వ్రచ్చినట్లు తోఁచుచున్నది. వారెవ్వరైయుందురోకదా. (ఎదుటజూచి) ఎవ్వరో ముప్వురు పురుషులిట్లు వచ్చుచున్నారు. ఆహా! ఏమి! వీరితేజము!

తే॥ గీ. నను గృతార్థునిఁ జేయ మ ♦ నంబులందు
దలఁచి కారుణ్యమునుబూని ♦ ధరణికిట్లు
లరుగుదెంచు ముమ్మూర్తులో ♦ యనఁగఁదలఁతు
గాకయుండిన నొరులకీ ♦ కాంతిగలదె.

నేనెదురేగి వీరిని బూజించెదఁగాక. (శ్రీకృష్ణభీమార్జునుల సమీపించి) బ్రాహ్మణోత్తములారా! నావందనముల స్వీకరించి నాయొనర్చు పూజలం గైకొనుఁడు. (నమస్కరించును).

(శ్రీకృష్ణాదులు మాటలాడకయుందురు).

జరా—(తనలో) ఇదియేమి! వీరు నాపూజలఁ గైకొనకయున్నారు. వీరియాకారములు నాకు మిగుల నద్భుతంబును గొల్పుచున్నవి. అదియేమికారణమోగాని వీరినిఁ జూడ నాచిత్తము నదియొకవిధమగు ననుమానము పొడముచున్నది. కానిమ్ము.

(ప్రకాశముగా)

మ॥ ధరణీదేవతలంచుఁ జిత్తమున మో ♦ దంబంది పూజింపఁగా
నరుగన్ నేనరుదేర మీరుఁగని నా ♦ సత్పూజ నిట్టుల్ నిరా
దరణన్ జేసెదరేల! ధర్మమగునే ♦ ధాత్రీస్థలిన్ నే నిరం
తరమున్ బ్రాహ్మణదేవతార్చనముచే ♦ తన్ గాదె వర్ధిల్లితిన్.

మీరు నాపూజలనుగైకొనకుండుటకేమికారణము? మీవేషమున బ్రాహ్మణత్వమును తేజమున క్షత్రియత్వమును విరాజిల్లుచున్నవి. అదియట్లుంచుడు.

చైత్యకాదియందున్న భేరులఁ బ్రచ్చి ద్వారముగానిద్వారమున నాపురము నేలఁబ్రవేశించితిరి. స్నాతకులగు మీరిట్లు సేయవచ్చునా!

9. పాట.

శ్రీకృ—జరాసంధా! నీవు తలంచినట్లు మేము క్షత్రియజాతి స్నాతకులము. నీవు మాకు విరోధివగుటంచేసి ద్వారముగాని ద్వారమునఁబురముఁ బ్రవేశించితిమి. అందుచేతనే నీవొసఁగు పూజల గైకొనకుంటిమి.

జరా—మీవాక్యములు నాకు మిగుల వింతగొల్పుచున్నవి. నేను మిమ్ము మున్నెన్నఁడును జూచినట్లు జ్ఞాపకములేదు.

తే. గీ. ఎన్నఁడైనను నపకార ♦ మేనొనర్చి
యుంటినే చెప్పుఁడీ మాకు ♦ నుర్వియందు
నట్టి కోర్కెట్లు శత్రుండ ♦ నైతి మాకు
సుజనసేవల దనరారు ♦ చుందు నేను.

నేను నిరంతరమును బ్రాహ్మణారాధనయు, మునిపూజయుఁ గలిగియుండి, సత్కార్యపరతంత్రుఁడనై యొప్పుచుందును. నేనెవరికిని నెగ్గుచేసి యెఱుఁగను.

శ్రీకృ—మాగధా! ధర్మవర్తివై తనరుచుంటివని నీవు చెప్పుచుంటివి. ఎవ్వరికిని నెగ్గుఁ జేసి యెఱుఁగనని నుడివితివి. నీవలెఁ గ్రూరాత్ముఁడై యెవ్వఁడు క్షత్రియులఁ జెఱఁబట్టి భైరవపూజార్థమై వారిని వధించువాఁడు గలఁడా? ఇంతకంటె దారుణమగు కార్యమేమికావలెను. మహాపాతకుఁడవై స్వజాతీయుల వధము చేయుచుంటివి. నీయట్టి పాపచరిత్రుని శిక్షింపక యూరకుంటిమేని యాపాపము మమ్ముఁ జెందును. అందుచే నిన్ను నిర్జింప వచ్చితిమి. నీకంటె బలాఢ్యుఁ డీముల్లోకములయందును లేడని గర్వించియుంటివి. ఇట్టిగర్వమును నీవెప్పుడును బూనవలదు. సత్కార్యములఁ జేయువారు సద్గతికరుగుదురుగాని యిట్టి దుష్కార్యములఁ జేయువారు సద్గతికిఁబోవరు. నీకుఁ బాపకార్యములయం దాసక్తిమెండు. నీవు నీతియు శాంతియును విడిచి వర్తింపుచుంటివి. ఇదియే నీతో మాకు వైరమునకు గారణము.

ఉ॥ పాండవవంశదీపకుఁడు ♦ భవ్యచరిత్రుఁడు ధర్మసూతి, భూ
మండలభర్త; నీదగు దు ♦ మానుషకృత్యములన్ దలంచి, నీ
దండనసేయ మమ్ములను ♦ ధర్మవిధంబున బంపెఁగావునన్
ఖండనమాచరించెదమొ ♦ పాఱెదవో వచియింపుమీ వెసన్.

10. పాట.

జరా—

శా. ఏమీ! వింతజనించె మీమనుజులు మి ♦ మ్మేరీతినేఁ బోయి సం
గ్రామంబందున నన్నుఁ గూల్పఁబలికెం ♦ గా ధర్మపుత్రుండు; నా
సామర్థ్యంబు నొకింత దానెఱుఁగఁడో ♦ శౌర్యంబుకస్గప్పెనో*
భీమోద్యత్ప్రళయాగ్నిమీఁద శలభం ♦ బే దూకనుంకించెఁగా.

ఆతఁడు బంపువాడును మీరువచ్చువారునా! ముందుగా మీ రెవ్వరో నాకెఱింగింపుఁడు.

శ్రీకృ—జరాసంధా! నేను నీకుఁ జిరపరిచితుఁడనే పీరిరువురును. నీకునూతనపురుషులు.

తే. గీ. ఇతఁడు భీముఁడు గృష్ణుండ ♦ నేను వీఁడ
యర్జునుఁడు నీదుపాపాగ్ని ♦ నార్పఁదలఁచి
వచ్చినారము మామాట ♦ పైననీవు
సత్పథంబుననిలిచి య ♦ శంబుగనుము.

నీవీ క్షణంబునఁ గారాగృహంబుననున్న రాజులనెల్లర విడిచి యింతటినుండి దుష్కృత్యముల సేయుట మానెదనని వాగ్దానమొసంగితివేని నిన్ను క్షమించెదము. లేదేని నీతో మాకు భండనమే నిశ్చయము.

జరా—ఓహో! కృష్ణా! నేడు మాయవేషమున నన్ను వంచింపఁదలంచి వచ్చితివా? ఇంతకుమున్న మత్పరాక్రమము రుచి నీవు చవిజూచియే యుంటివి. నాఁడాడికి దాళజాలక మధురానగరమువిడిచి ద్వారకఁజేరిన జగజెట్టివి. నేడు నాతోఁబోరుటకు దగుదునని యెట్లువచ్చితివి. ఈమధ్య నీ తెలుఁగునకు రాక శాంతము వహించి యూరకుంటని. మరల నాకోపాగ్నినిఁ బ్రజ్వరిల్లఁ జేయుచుంటివి. కానిమ్ము.

శ్రీకృ—మాగధా! ఇప్పుడా సంగతియంతయు నేల! మేమిప్పుడడిగినవాక్యములకేమి ప్రత్యుత్తరమిచ్చెదవు?

జరా—కృష్ణా! యాదవకులసముద్భవా! నీ పరాక్రమమునుగూర్చి యెవ్వరెఱుఁగరు. శౌర్యాతిరేకమున ననేకరాజులను సంగ్రామరంగంబున నోడించితిని. మీవాక్యములకు భీతిల్లి కారాగృహముననున్న రాజులను విడుచువాడను గాను. నే నేవిధమైన యధర్మకార్యములను జేయలేదు. పరాక్రమంబున రాజులను జయించుట యధర్మముగాదు, దేవార్థమై నృపాలురఁ జెఱఁబట్టితిని.

చ. పురహరుఁడె త్తివచ్చినను ♦ బోరికి జంక నొకింతయేని; ను
స్తరబలశౌర్యసంపదల ♦ ధాత్రిని రాజిలుచున్నవాఁడ; మి
మ్మరసి భయంబునందెదనె ♦ యాహవభూమిని నేఁడుమిమ్ము ము
వ్వుర వెసఁదాకి గూల్చెదను ♦ భూరిభుజాబల సత్వమేర్పడన్.

ఇదిగో! నేను పోరాటమునకు సంసిద్ధుఁడనై యుంటిని. మీరుముగ్గురును నేకమై వచ్చిననుసరే.

శ్రీ కృ—మాగధా! ఒక్కనితో బల్వురుపోరుట ధర్మంబుగాదు. మాముగ్గురిలో నొక్కని నేరుకొనుము.

జరా—(భీమునిఁజూచి) భుజబలంబున నాకీతఁడు సమానుఁడని తోఁచుచున్నది. కావున నేనీ భీమునితోడనే పోరాడెదగాక. (భీమునిఁజూచి) 11. పాట.
రమ్ము. యుద్ధోచితస్థలమున కరుగుదము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

శ్రీ కృ—బావా! అటుఁజూడుము. భీమసేన జరాసంధుల మల్లయుద్ధ మెంతతీవ్రముగ జరుగుచున్నదో!

అర్జు—జరాసంధుని బల మద్వితీయమైనది. మనభీముని నాతఁడు బంతివలె నెగరవైచుచున్నాఁడు. మాధవా! మనభీమున కేమిహాని వాటిల్లునో. మన మయ్యెడకరుగుదమా!

శ్రీ కృ—అటుఁజూడుము. జరాసంధుని బాహువులందుఁజిక్కిన భీముఁడు పట్టుదప్పించుకొని జరాసంధుని నొడిచిపట్టి నేలఁబడవైచినాఁడు. ఈదెబ్బతో జరాసంధుఁడు విగతజీవుఁ డగును. రమ్ము.

(నిష్క్రమింతురు.)

---

# ద్రౌపదీవస్త్రాపహరణము.

## ద్వితీయాంకము

ఇంద్రప్రస్థపురము:—రాజవీథి (ప్రవేశము:—గోవిందశర్మ).

గోవిం—(తనలో) ఆహా! ఈ ధర్మనందనుని సామ్రాజ్యము వేయేండ్లు వర్ధిల్లుగాక. ఏమి! ఈతని దానములు. ధర్మములు. మున్ను హరిశ్చంద్రాది చక్రవర్తులు రాజసూయము జేసిరని వినియుంటినిగాని, వారీపగిదినిఁ జేసియుండిరని తలంపను. మహాదారిద్ర్యములో నల్లాడుచున్న బ్రాహ్మణులకు సంతోషము కలిగినది. జరాసంధుఁడు జీవించియుండఁగా నీ యుధిష్ఠిరుఁడు యాగమెట్లు సేయునాయని తలంచితిని; కాని సవనార్థమై యాతఁడు భీమునిచే వధింపఁబడుటచేత, నేకొఱంతయులేక యాగము మహావైభవముగా జరుగుచున్నది. నేటితో సవనము సంపూర్తియగును. నేఁడు బ్రాహ్మణుల కనేకదానములు సేయఁబడునట.

(తొందరగా రామశాస్త్రి ప్రవేశము.)

రామ—నిజంగానేనా సాయనా! ఈరోజున యుధిష్ఠిరుఁడు బ్రాహ్మణులకు వలసిన దానములు సేయునా!

గోవిం—సందియమేమున్నది. నేటితో నాతండొనర్చు రాజసూయము పూర్తియగును.

రామ—గోవిందశర్మా! నాకొక్క సందేహముకలిగినది. ఈ యింద్రప్రస్థపురమున ధృతరాష్ట్రుఁడేకదా ధర్మనందనుని నిలిపినాఁడు. అట్టిచో నీతనికింత ధనమెక్కడినుండి వచ్చినది.

గోవిం—చతుస్సముద్రములరీతిఁ జెలంగుచున్న యతని నల్వురుతమ్ములును దిగ్విజయము చేసికొనివచ్చిరి.

సీ. ప్రాగ్జ్యోతిషనగర ♦ వల్లభాదిన్నృపుల
నాహవంబున గెల్చె ♦ నర్జునుండు
ఆదశార్ణపతిని ♦ నాజిలో నోడించె
బలపరాక్రమశాలి ♦ వాయుసుతుఁడు
మాహిష్మతీపుర ♦ క్ష్మాధీశునోడించి
యలరెను మాద్రీసు ♦ తాగ్రజుండు
మరు మాళవాది భూ ♦ వరులదాకి జయంబు
నందె నాసహదేవు ♦ డాహవమున

తే. గీ. వరున నిట్లు ధర్మజునిసో ♦ దరులు నాల్గు
దిశలకేగి ద్రవ్యంబు ♦ దెచ్చినారు
యధ్వరార్థమై యమితశౌ ♦ ర్యంబుచేర్చి
కొఱఁతయున్నదె ధర్మజ ♦ క్షితిపతికిని.

అదిగో! ఘంటానాదము వినవచ్చుచున్నది. సత్వరముగ యాగశాలకు బోవుదము.

(ఇరువురును నిష్క్రమించుచున్నారు.)

---

రంగము:— (యాగశాల:—ధర్మజ భీమార్జున నకులసహదేవులు, శ్రీకృష్ణుఁడు, భీష్మద్రోణులు, దుర్యోధన కర్ణ దుశ్శాసనులు, శిశుపాలుఁడు మొదలగువారు

ప్రవేశము.)

ధర్మ—(భీష్మునిఁజూచి) పితామహా!

ఉ. నాయెడ సత్కటాక్షము మ ♦ నంబున హెచ్చుగఁబూని ద్రోణుతో
నీయెడ కేగుదెంచితివి ♦ యీమఖముర్విఁ దిలకింపనెంచి; గాం
గేయ! ముదంబుఁ జెందితిని ♦ కీర్తిగడించితి నెంతయేనియుర్
నాయజనంబు సర్వనర ♦ నాధులుమెచ్చఁగఁబూర్తియయ్యెడుర్.

పెద్దవాడవగు నీవుండుటంజేసి యజ్ఞనిర్వహణంబున కే కొఱఁతయు సంభవింపక యున్నది.

భీష్మ—వత్సా! ధర్మతనూభవా! నాయందు నీకున్న ప్రేమచే నట్లు వక్కాణించెదవు. కాని యిందు నేను నిమిత్తమాత్రుఁడను. మనుమఁడవగు నీవు సవనము సేయు

చుండఁగా వచ్చుట నాకువిధిదైనయున్నది. సర్వజగన్నియామకుఁడగు శ్రీకృష్ణభగవానుఁడు మీయెడల సంపూర్ణకృపాంతరంగుఁడై యుండగా నీకెట్టికొరంత లైనఁగలుగునా?

మ॥ గురుఁడై మేనమఱందియై సచివుఁడై ♦ కొండంతచుట్టంబునై
కరుణాపూర్ణత మిమ్ము సంతతమిలన్ ♦ గాపాడుచున్నాఁడు; శ్రీ
ధరుఁడీ కృష్ణుఁడు నట్టిచో మిముఁగొలం ♦ తల్ జెందునే యెప్డు భూ
వరబృందంబున గీర్తిగాంచితివి నీ ♦ భాగ్యంబు సామాన్యమే.

శ్రీకృ—(భీష్మునిఁజూచి) అమరనదీతనూభవా! నీకు నాయందున్న యభిమానమిట్లు పలికించుచున్నది.

తే. గీ. ధర్మజునిసత్యసంధత ♦ తావకీయ
కరుణ,గురుని యాశీస్సును ♦ గాన మఖము
విఘ్నములు గల్గకుండంగ ♦ వెలసె భువిని
బాగడఁగానేల నన్నిట్లు ♦ పూజ్యచరిత.

ధర్మ—(కృష్ణునిఁజూచి) నందనందనా! నీయమూల్యమగు కరుణయే మమ్మిట్టిస్థితికిఁ దెచ్చినది. అఖిలరాజులను హింసించుచు భుజబలమదోద్రేకియై కన్నును మిన్నునుగానక చరించుచున్న జరాసంధుని వధించుటయు, నీయాగము సేయుటయు నీసహాయమే కదా కారణము. నీకారుణ్యము లేనిచో నాబోటి సామాన్య భూపాలు డిట్టి యాగమును సేయునా?

శిశు—(తనలో) ఈధర్మనందనుఁడు వాసుదేవుని నెంతగాఁ బొగడుచున్నాఁడు.

భీష్మ—(ధర్మరాజుఁజూచి) ధర్మనందనా! నీమఖ మతివైభవముగా జరుపఁబడెను. కాని నీవిప్పుడొక మహత్కార్యము చేయవలసి యున్నది. స్నాతకుఁడును, ఋత్విజుండును, సద్గురుఁడును, భూతలేశ్వరుఁడును, సదాపూజనీయులు. నీవు దీనిని బాగుగవిచారించి యీసభయందు సద్గుణములయం దెవ్వఁడు పెద్దయో వానినిఁ బూజింపుము. దీనివలన నీకు యశంబును శుభంబును పుణ్యంబు గూడ గలుగును.

ధర్మ— తే. గీ. తాతవగు నీవు నాయందు ♦ దయనుబూని
చేయు సద్బోధ శిరముపై ♦ జేర్చికొందు
నీవు చెప్పిన తెఱగున ♦ నిచటనట్టి
వాడెవండో వచింపుము ♦ భవ్యచరిత.

ఇట్లుసేయుమని వచించిన దయాంతరంగుఁడవగు నీవే యట్టి పూజార్హుఁడగు పురుషుఁ డీసభయం దెవ్వరో వచియించి, నన్నుఁ గృతార్థునిఁ జేయుము.

శిశు—(తనలో)ఇప్పుడీ భీష్ముఁ డెవ్వరిని బూజింపుమని చెప్పునో!

దుర్యో—(తనలో) ఈవృద్ధుఁ డేదియో యనవసరమైనది నెత్తిపైనిఁ బెట్టుకొనుచుండును. ఇంతమంది ఘనులున్న సభలో యెవ్వఁడు మహాత్ముఁడని నిర్భయముగా నిర్దేశించి చెప్పుట కీతనికి నోరెట్లు వచ్చునో!

కర్ణు—(దుర్యోధనునితో రహస్యముగా) రారాజా! భీష్ముఁడెవ్వనిని బేర్కొనునో నీవు చెప్పఁగలవా?

దుర్యో—అయ్యది మనమెట్లు నిరూపింపఁగలము?

కర్ణు—ఆలోచింపఁగా మహీతలమెల్ల నేకఛత్రముగఁ బరిపాలించు చక్రవర్తివగు నిన్నుఁ బేర్కొనునేమో యని తోచుచున్నది.

దుర్యో—పితామహునకు మనయం దంతకరుణ యున్నదా?

భీష్మ—(ధర్మరాజుంగాంచి) ధర్మపుత్రా! పూజార్హుఁడగు పురుషునిఁ బేర్కొను భారముగూడ నాపైననేపెట్టితివా? కానిమ్ము అడిగినప్పుడు తెలిసియుండియు, జెప్పకపోవుట ధర్మముగాదుకదా! నేనెఱింగినంతవఱకు దెలిపెదను.

సీ. ఉదయభానునిరీతి ♦ నొప్పుగానీసభ
నెవ్వాఁడు వెల్గుచు ♦ నెసగుచుండె
ఎవ్వానిమూర్తిని ♦ నెల్లదేవతలును
తాపసుల్ సతతంబు ♦ దలపుచుంద్రు
దేవతాప్రార్థన ♦ భావించి యెవ్వాఁడు
యాదవకులమున ♦ నవతరించె
సంతతభక్తర ♦ క్షణధురంధరుఁడంచు
నెవ్వాఁడుబిరుదు వ ♦ హించియుండె

తే. గీ. యట్టి సద్గుణభావు దే ♦ వాదిదేవు
శిష్టజననుతిపాత్రు ల ♦ క్ష్మీకళత్రు
గృష్ణుఁ భక్తిమైనర్చించి ♦ కీర్తిగాంచు
మయ్య సర్వశుభంబుల ♦ నందగలవు.

దుర్యో—(తనలో) కృష్ణునకును శిశుపాలునకును నాజన్మవైర మున్నది. ఇట్టిసమయమునఁ గృష్ణునిపై నాతని కాగ్రహముకలుగునట్లు చేయువలయును. (రహస్యముగా శిశుపాలునితో) శిశుపాలా! కృష్ణుఁడు పూజార్హుఁడని భీష్ముఁడు ధర్మనందనునితోఁ బలికినమాట మనకందఱకును దలవంపుల దెచ్చుటకే గాంగేయుఁడిట్లుచెప్పినాఁడు. ఈమాటకు మనమంగీకరించి యూరకుండవలసినదేనా?

శిశు—మీరందఱు సైరించినను నేను సైరింపను. పూజ పూర్తిగానిమ్ము. చూచెదను గాక.

ధర్మ—(శ్రీకృష్ణునిజూచి) దేవా! వాసుదేవా! త్రిజగత్పూజితపాదపంకేరుహుఁడవైన నిన్ను భీష్మానుమతమునఁ బూజించి నాజన్మము సఫలత్వము జేసికొందునుగాక! (సహదేవునిజూచి) సహదేవా! బంగారుకలశముతో విమలసలిలము దెమ్ము.

(సహదేవు డట్లుసేయును)

ధర్మ—భగవంతా! నందనందనా! నీపాదములిటు దెమ్ము. (కృష్ణునిపాదములుకడిగి జలము శిరముపై జల్లుకొని)

సీ. కమలాలయాదేవి ♦ కాంక్షించి యేదేవు
పాదకైంకర్యంబు ♦ బడయఁగోరె
సనకాదిమౌనీంద్ర ♦ సంఘమానసపద్మ
భృంగమై యెవ్వాఁడు ♦ వినుతిగాంచు
భక్తరక్షణ కార్య ♦ భారంబు నిరతంబు
నెవ్వాని తలపైన ♦ నెసఁగియుండు
ధరణీభారము సమ ♦ స్తమువాప నెవ్వాఁడు
యాదవాన్వయమున ♦ నవతరించె

నట్టి శ్రీహరివైన నీ ♦ యమలపాద
పంకజమ్ములఁగడిగి త ♦ త్పావనోద
కంబు దాల్పంగగంటి శి ♦ రంబుపైన
మాధవా యాదవాన్వయ ♦ మహితచంద్ర.

(సభయందు గరతాళధ్వని)

శిశు—(తనలో) ఆహా! ఏమి! ఈసభ్యుల యవివేకము. యాదవుని నొక్కని నీ విధంబున యుధిష్ఠిరుఁడు పూజించినంతనే, తమ యంగీకారమును సూచింప

జయజయ ధ్వానములు సలుపుచున్నారు. నాకు శాత్రవుఁడగు కృష్ణుఁ డిట్టి గౌరవము నొందఁగా నేనుచూచి సహింపఁగలనా! ఇక నే నూరకొనరాదు. (ధర్మరాజుంజూచి) ధర్మనందనా! నీవుధర్మశీలుఁడవనియు, సత్యసంధుఁడవనియు దలంచితినేగాని, యిట్టి యవివేకివని యెన్నఁడును దలంపనైతిని. ఈ సభయందు పెక్కండ్రు రాజాధిరాజులును, మునీంద్రులును, భూసురులు నున్నారు. వీరినందఱను విడిచి కృష్ణునిఁ బూజించి నీ యవివేక మెఱుంగఁ జేసితివి. ఈ వాసుదేవుడు పూజార్హుఁడని నీకుఁ దోచెనుకాబోలు. ధర్మరహస్య మెఱుఁగుట కష్టముగదా. విచారవిదూరుఁడగు భీష్ముఁడు కృష్ణునిఁ బూజింపుమని చెప్పినంతనే యట్లొనర్చితివి. ఇది మంచియో చెడ్డయో యూహింపనైతివి. దీనంజేసి వృద్ధుల చిత్తముల కాగ్రహము జనింపకుండునే! శ్రీకృష్ణుని యందు మీకంత యనురాగమున్నచో వలసినకోరికల దీర్పవచ్చును. కావలసిన ధనమీయవచ్చును. అంతియేగాని విశిష్టజన పూజకర్హుండని, తలంచి యీ నిండుసభలో నాతనినిఁ బూజింపవచ్చునా? ఈతనిని నీవేమని భావించి పూజించితివి?

సీ. రాజంచు నెంచితే? ♦ రాజ్యాభిషిక్తులే యాద
వులు కారటంచును ♦ దెలియవొక్కొ
వృద్ధుండటంచు భా ♦ వించితే! పూజ్యుఁడా
వసుదేవుఁ డీసభ ♦ వరలియుండ
ఋత్విజుండంటివా? ♦ శ్రీహరిసన్నిభుం
డైనట్టి వ్యాసునిం ♦ దరయలేవ
ధరణీశుఁడంచును ♦ దలచితే? రారాజు
కౌరవాగ్రజుఁ డిందు ♦ గలిగియుండ

తే॥ ఎందులకుఁ గొఱగాని యీ ♦ హీనకులుని
వాసుదేవునిఁ బూజింప ♦ భావ్యమగునె
యనిమిషనదీసుతుని మాట ♦ లాలకించి
మోసపోయితి వెంతయు ♦ భూమిపాల.

రాజులందఱిలోన యుధిష్ఠిరుఁడు పూజ్యుఁడని తలంచి నీముఖము సందర్శింపవచ్చిన రాజులకెల్లరకును నవమానము గలుగఁజేసితివిగదా. నీవు పూజించినదే చాలునని యీ గోపాలుఁడు తలంచినాఁడు. ఛీ! ఇట్టిసభ నుండరాదు.

(సభనువిడిచి పోబోవును)

ధర్మ—(శిశుపాలుని చేయిబట్టుకొని) శిశుపాలా! శాంతింపుము.

ఉ. యాదవవంశమందున సు ♦ రాదులప్రార్థనమాలకించి య
త్యాదరలీల భూభరము ♦ నంతయుఁ బాపఁదలంచి, పుట్టె దా
మోదరుఁడిట్లు; కాని యగు ♦ పుంగవుఁడేయని యెంచబోకుమీ
భేద మొకింతలేదుసుమి ♦ వీనికి నాహరికిన్ నిజంబుగన్.

సుగుణశీలురకిట్టి యాగ్రహముండరాదు. వాక్పారుష్య మగ్నికంటెను, విషముకంటెను దారుణంబైనదని తలంపుము. ఈకృష్ణుఁడు సామాన్యుఁడుగాడు. బ్రహ్మ యుదయమునకుఁ గారణుఁడైనవాడును, వేదములయందుఁబ్రకాశించువాడును, ద్రిలోకపూజ్యుఁడును నై యున్నాఁడు. వాసుదేవుని మహిమలుభీష్ముఁ డెఱింగినట్లు నీవెఱుఁగవు. పెద్దలచరిత్రము నీవంటివారెఱుంగుట కష్టము. నీకంటె వృద్ధులైనవారు వాసుదేవుఁడు పూజార్హుఁడని వచింపగా నీవు కాదనుట ధర్మమగునే! శాంతించి యిట నాసీనుఁడవుగమ్ము.

శిశు—ఓహోహో! నీవు పూజించుటకును నీతఁడు నీపూజ గైకొనుటకును సరి పోయినది. పాపము! కృష్ణుఁడు భగవంతుఁడని పొగడుచుంటివి.

సీ. వ్రేపల్లెయందున ♦ గోపాంగనలచెంత
సిగ్గింతయును లేక ♦ చెలగువాని
ప్రతికొంపఁదిరుగుచు ♦ పల్లవాంగనలచే
ననిశంబు చీవాట్ల ♦ నందువాని
జలకేళిమైనున్న ♦ సతులవస్త్రంబుల
గొని మానములజూచు ♦ కొంటెవాని
పెరుగు పాలోయమ్మ ♦ వేగొనరంచును
దిరుగువారికిఁ బుట్టి ♦ బరగువాని

తే. గీ. శ్రీరమాధీశుఁడంచును ♦ జిత్తమందు
దలఁచి రాజులెల్లరు నవ్వ ♦ లలితగతిని
బూజనీరీతి గావింపఁ ♦ బోలునొక్కొ
యిద్ది వెఱ్ఱితనముగాదె ♦ యెంచిచూడ.

భీష్మ—(ధర్మరాజునుజూచి) ధర్మనందనా! రాజ్యలక్ష్మీలలనాంధ బుద్ధిం గన్నను మిన్నునుగానక యిట్లుబలుకుచు సభనువిడిచిపోవు యీ శిశుపాలు నేల శాంతిప జేసెదవు. (శిశుపాలునిఁజూచి) శిశుపాలా! మూఢుండవై ధర్మజుడు హరిని

బూజించుట యయోగ్యమని నీవు పలికితివి. కావున నేనును గొంతపలుకవలసి వచ్చినది. ఇచ్చట నున్నవారెల్ల శ్రీహరికరుణకుఁ బాత్రులేయని తలంపుము. ఉత్తమజ్ఞానవృద్ధిం దనరువాఁడు బాలుఁడయ్యును బ్రాహ్మణుఁడు పూజార్హుఁడు. ఉర్వీశ్వరకులయం దమితవిక్రమసమృద్ధినొప్పు క్షత్త్రియుడు పూజ్యుఁడు. ఈకారణములచేత గృష్ణుఁడు పూజ్యుడు. ఈతఁడు నీకును నాకునేగాక విష్టపత్రయవాసులెల్లరకును పూజ్యుఁడేయని తలంపుము. ఈతఁడు తృప్తిఁజెందెనేని మూఁడులోకములును దృప్తిజెందును. అధికయోగనిష్ఠాగరిష్ఠులగు మునీశ్వరులెఱింగినట్లు శ్రీకృష్ణునిమహిమ నీవెఱుంగఁజాలవు. ఇంక ననవసరమైన మాటలు మాని యటఁగూర్చుండుము.

శిశు—(భీష్ముని(జూచి) శ్రీకృష్ణునిఁ బొగడుటకు నీకొక నాలుక చాలకయున్నది. నీనాలుక వేయిచీలికలు గావలసియున్నది.

సహ—(కోపముతో)

తే. గీ. అవని వసుదేవసూతికి ♦ నర్ఘ్యమిచ్చుట
నర్హ మనిపల్కు నానర ♦ నాథునెత్తి
పైనఁ బెట్టుదు నావామ ♦ పాద మిదిగొ
శౌర్యధనులైన నృపతులు ♦ సంతసింప.

శిశు—(దూరముననున్న తన సేనానాయకుఁడగు సునీథుంగాంచి)సునీథా!ఇటురమ్ము.
(సునీథుఁడు సమీపింపఁగా నేదియో రహస్యము చెప్పిపంపును)

ధర్మ—(భీష్ముని(జూచి) పితామహా! శిశుపాల పక్షపాతులెల్లరును సభవిడిచి పోవుచున్నారు. ఏదియో ప్రళయము సంభవించునట్లున్నది. వీరినెట్లయిన శాంతచిత్తులుగాఁజేసి యాగసమాప్తి సమయమున నే విఘ్నమును గలుగకుండఁ గాపాడుము.

భీష్మ—ధర్మనందనా! యజ్ఞరక్షకుండై శ్రీమన్నారాయణుఁడగు కృష్ణుఁడుండఁగా నీయజ్ఞమునకు విఘ్నమెవ్వరు గలిగింపఁగలరు. చైద్యపక్షపాతులైన వారెల్లరును శ్రీహరి యలిగెనేని నిమిషములో భస్మమగుదురు. శ్రీకృష్ణుని పరాక్రమ మందఱును నెఱిఁగినవారే. శిశుపాలుని దర్పముగూడ నడంగఁగలదు.

శిశు—(కోపముతో) ఈముదుసలియైన భీష్ముఁడు కృష్ణుని నొకపెద్దగాఁ జేసినాఁడు. ధర్మతత్త్వ మీతఁడుదప్ప మఱియెవ్వరును నెఱుఁగరుకాబోలు. (భీష్ముని

జూచి) గాంగేయా! వాసుదేవుని భగవంతునిగను వీరాగ్రేసరునిగను బరిగణించితివి. ఈతని పరాక్రమశక్తు లెవ్వరెఱుంగరు. ఈవాసుదేవుఁడు నేఁడే యీలోకమునకుఁ గ్రొత్తగా నవతరించినాఁడా. సభాజనము లేమని భావింతురో యను ననుమానము లేకుండఁబలుకుచుంటివి. స్తన్యమీయవచ్చిన పూతనను జంపుటయు, బండిని దన్నుటయు, వృక్షముల విఱచుటయు, వల్మీకమాత్ర పర్వతము నెత్తుటయు, మొదలగునవి వాసుదేవుని శౌర్యకార్యములై దీపించుచున్నవి. ఈతఁడు పూజార్హుఁడని చెప్ప నీనాలుక చీలవలసియున్నది. స్త్రీ గోవధమాచరించుట మహాపాతకమని చెప్పుదురు. ఈ రెండును కృష్ణుఁడుచేసి మహాపాతకము గట్టుకొనెను. ఈగోవిందునిసంగతి నేనెఱుంగనా? జరాసంధునకుభీతిల్లి మధురానగరమును విడిచిన శూరుఁడుకాఁడా!

భీము—(భీష్మునిజూచి) పితామహా!

తే. గీ. కృష్ణు సర్వలోకైక స ♦ హిష్ణు నిట్లు
ముందు వెనుకలు జూడక ♦ డెందమందు
నింద సేయుచు నుండిన ♦ నీచు విని
వీచమడప నాజ్ఞనిడుదు ♦ వే మహాత్మ.

వాసుదేవుని దూషించుచున్న యీదురాత్ముండగు శిశుపాలుని దర్పమడఁచుటకు మద్గదాదండము తత్తరమందుచున్నది. కరుణించి యిక్కార్యమునకు నాజ్ఞ నొసంగితివేని నాసంతోషమునకు మేర లేకయుండును.

భీష్ము—వాయునందనా! నీవు తొందరపడవలదు. శ్రీకృష్ణుఁడే యీతని దర్పమడఁపఁగలడు.

శిశు—(కృష్ణునిఁజూచి) కృష్ణా! ధర్మజుఁడు నీకుఁ బూజయొసంగినంతనే తగుదునని గైకొంటివి. ఇందులకు నీచిత్తమెట్లు సమ్మతించెను? నీవిట్టి యకార్యములకుఁ గడంగి రాజుల కందఱకును నవమానము గూర్చితివి. నిన్నును, భీష్ముని, పాండవులనుగూడ వీచమడఁచెదఁగాక! రమ్ము.

శ్రీకృ—(తనలో) ఇంక నేను సైరింపరాదు. (సభ్యులనుజూచి) సభ్యులారా! ఇంతవఱకును శిశుపాలుఁడు నావిషయమై పలికిన పలుకులు మీరు వినియుంటిరి కదా. మున్ను ప్రాగ్జ్యోతిషమునకు నే నరిగినప్పుడు వీడు ద్వారకానగరమున కగ్నిఁబెట్టెను. భోజరాజులు స్త్రీలతో రైవతకాద్రియందు నిద్రించియుండగాఁ గొందఱవధించె. వసుదేవుఁ డశ్వమేధయాగము సేయుచుండగా, హయ

మును వధించి దానికి విఘ్నమొనఁగూర్చెను. దురాత్ముఁడై బభ్రుభార్యను దనకు భార్యగాఁ జేకొనెను. మఱియు నా కనేకమైన యుపకారములఁ జేసినాఁడు. మా యత్తయగు సాత్వతి నన్ను, బార్థించుటం జేసి వీనియెడల శతాపరాధంబులు సహించితిని. ఇప్పుడు మీ యందఱియెదుట నన్ను దూషించుట మీరు చూచియేయుంటిరికదా! ఇంక వీనిని సైరింపఁజాల.

శిశు—(కృష్ణునిఁజూచి) ఓయీ! నీవు సైరించుట యెంత; సైరింపకపోవుట యెంత; నాయెడల నింద లారోపింతువు. నాకిచ్చెదనన్న కన్నెను నీవు బలవంతముగ గైకొనలేదా? ఛీ! నీతో సంభాషింపరాదు.

శ్రీకృ—ఓరీ! నీకుఁ గాలము సమీపించినది. అందుచేతనే యిట్లు పేలుచుంటివి.

మ. సమదాటోప పతంగపుంగవ విభా ♦ స్వద్దీర్ఘ చంచూస ము
త్క్రమునం దల్పఫణావిజృంభణ నట ♦ త్కాకోదరంబట్లు నీ
వు మదోద్రేకుఁడవై ననుంగవయగా ♦ బూర్ణప్రతాపంబుతో
గుమతీ యెంచెదవే నినుఁ దునిమెదఁ ♦ ఘోషింప నక్తంచరుల్.

ఇంచుక సేపు రణంబున నిల్వుము. నీదర్పము జూచెదగాక!

శిశు—ఏమీ! నీవు రణముసేయుదువా! రణమనఁగా నేమనుకొంటివి?

సీ. ఆరూఢమధుర పీ ♦ ఠారవంబులుగావు
ప్రతిభటాభీల హుం ♦ కృతులుగాని
మైబూసికొను టక్కె ♦ మంచిగంధముగాదు
రక్తసంయుత సంగ ♦ రంబుగాని
అదలించితోలంగ ♦ నాలమందలుగావు
భయముగొల్పెడి వీర ♦ వరులుగాని
గోపికా యువతుల ♦ గుబ్బపోటులుగావు
వేడిచూపెడి బాణ ♦ వితతిగాని

తే. గీ. ముదము తోనుండ రేపల్లె ♦ భూమిగాదు
నిఖిల శస్త్రాస్త్రములుగల్గు ♦ నేలగాని
యేడ నీవేడ నని సేయు ♦ టేడ; ద్వార
కాపురంబును జేరి సౌ ♦ ఖ్యంబుగనుము.

శ్రీకృ—చైద్యాధమా! రణంబనగా నేమో నాకునుఁ దెలియును. ఇంచుకకాల మిచ్చుటనే యుందుము.

శిశు—మ॥ యదువంశాధమ! పాఱిపోవకసము ♦ ద్యద్ధైర్యముఁ బూనుచుఁ
గదనక్షోణిని నిల్వు నీదుశిరమున్ ♦ ఖండించెద న్నేఁడు; మా
గధుఁజంపించిన దానికిన్ ఫలము లో ♦ కఖ్యాతినింగాంతు నా
త్రిదశుల్ గూడ భయంబు జెందఁగ జయ ♦ శ్రీ గాంచెదన్ మించెదన్.

శ్రీకృ—(చక్రముదాల్చి) ఇంక నిన్ను నేను గరుణింపరాదు.

మ. ననునీ వెవ్వనిగాఁ దలంచితివ్ " నా ♦ నాదైత్యవంశాటవీ
ఘనదావానల మూర్తినంచెఱుగవో ♦ కష్టాత్మ నీయట్టి దు
ర్జనబృందంబునుగూల్చి యీపుడమి భా ♦ రంబెల్లబాపంగ నే
జననంబందినవాఁడనం చరయుమీ ♦ త్స్మాపాలవంశాధమా.

శిశు—కృష్ణా! ఆత్మస్తవమేల చేసికొనెదవు; నీసంగతి యెవ్వరెఱుంగరు? మూఢులు నిన్ను భగవంతునిగా దలంచి పూజించినంత మాత్రముననే గర్వాంధకార ప్రమత్తహృదయుండవై నేను భగవంతుఁడనని చెప్పుకొన సాగితివిగా? నీ భగ వల్లీలల నేనెఱుఁగక యుంటినా?

సీ. వరమధురాపురిన్ ♦ వసుదేవదేవకుల్
గాంచినిన్ సుతునిఁగాఁ ♦ గంసభీతి
నందగోపుని యింట ♦ సందియంబునువీడి
విడువంగ నిన్నునుఁ ♦ బెంచెనతఁడు
గోపార్భకులతోడఁ ♦ గూడి చలిదిమూట
గట్టుకుఁ దగిలించి ♦ కాననముల
గోవులం గాచిన ♦ గొల్లవాడవు నీవు
పూర్వపుణ్యంబున ♦ భూరిభాగ్య
తే. గీ. మొుది ద్వారకాపురమున ♦ నుంటి వంత
మాత్రముననె నీవిధమున ♦ మానసమున
నమిత గర్వముఁబూని శ్రీ ♦ హరి నటంచు
జెప్పికొందువె నీవు ఛీ ♦ సిగ్గులేక.

నిన్ననవలసిన పని యేమున్నది? నీకిట్టి యాధిక్యతఁగూర్చిన మూర్ఖులను జీల్చవలయునుగాక!

సీ॥ గోగోపప్రీతికై ♦ గోవర్ధనంబెత్తి
నంతనె నిన్ భగ ♦ వంతుఁడనిరి
గోపికలకుఁజూపు ♦ కొంటె చేష్టలగాంచి
మహితప్రభావ సం ♦ పన్నుఁడనిరి
కల్లపాముసుబోలు ♦ కాళీయుద్రొక్కి సం
తనె హరియగు రమా ♦ దారుఁడనిరి
కుబ్జవంకరదీర్చి ♦ గూడినంతనె యస
మాన శక్తినినొప్పు ♦ మాన్యుఁడనిరి

తే. గీ. యిట్టివేకద నీ చర్య ♦ లెల్ల; యింత
మాత్రమునకే మదికి గర్వ ♦ మా! జగంబు
సర్వ్వననింద్యమైన నింతయున్ ♦ దలఁపవేల
చెప్పికొనుటకు సిగ్గైనఁ ♦ జెందవేల.

నీ పరాక్రమ శౌర్యంబులను గూర్చి నీవు చెప్పుకొన నక్కఱలేదు.

సీ. కడుఁబ్రీతి నీకు జన్ ♦ గుడిపినపూతనఁ
గరుణఁబూనకమదిఁ ♦ జంపినావు
నందయశోద లా ♦ నందమందగ నొక్క
చివుకుబండిని బిప్పిఁ ♦ జేసినావు
మద్దిచెట్లను రెండు ♦ మహిత మోదమునంద
గొల్లవాండ్రెల్లరు ♦ గూల్చినావు
బక్కబకమును నిం ♦ కొక్క ఖరంబును
చిత్రలీలనుజంపి ♦ చెలగినావు

తే. గీ. ఇట్టి పనులఁజేయుచు జగ ♦ జెట్టిననుచు
పిట్టవీగుచునుంటివి ♦ బృధ్వియందు
సిగ్గులేదు వీనికిని ఛీ ♦ ఛీ యటంచు
దండముల జనుల్ నవ్వంగ ♦ నందపుత్ర.

బాల్యవీర విహారము లిట్లున్నవి. పెద్దవాడవైన పిదపఁ జేసిన చర్యలు చెప్పనక్కఱవేదు.

సీ. మామమామానంచును ♦ మదియందుఁ దలఁపక
యాలకంసునిం దెగ ♦ టార్చినావు

మాగధుభయమున ♦ మధురాపురమువీడి
ద్వారకాపురిఁ జేరి ♦ తనరినావు
ప్రాగ్జ్యోతిషాధిపు ♦ భంజింపఁగాలేక
యింతిచేతికి విల్లు ♦ నిచ్చినావు
కడుఁబరాక్రమశాలి ♦ కాలయవనుఁగూల్ప
నతిమాయలనుబన్ని ♦ యలరినావు

తే॥ గీ॥ అంతియేగాని మాయలే ♦ కాజియందు
బలపరాక్రమమేర్చి యె ♦ వ్వానిఁగూల్చి
నావు; హంసడిభకు లనా ♦ నరకదైత్యు
నా! కాలయవనునా! వి ♦ నంగఁదలఁతు.

ఇంతయేల? నిన్న మొన్నకదా. భీమార్జునులకు బ్రాహ్మణవేషములు వేయించి, గిరివ్రజమునకుఁ దోడ్కొనిపోయి భుజవీర్యసింధుండగు జరాసంధుని మాయఁబన్ని భీమునిచేతఁ జంపించి తగుదునని తలయెత్తుకొని చరించుచుంటివి.

శ్రీకృ—మ॥ ధరణిన్ క్షీరపయోధిమధ్యగతర ♦ త్నద్వీప రత్నావళిన్
బరిశీలింపక నత్తగుల్లలనుచున్ ♦ భక్షింపఁగా బోవు కొ
క్కెర పుల్గుంబలె నన్ను నిందు సభలో ♦ గ్రేడింతె కానిమ్ము; సం
గరమందున్ భవదీయశౌర్యము గనం ♦ గాఁ జేయు చైద్యాధమా.

శిశు— నీ నా బలపరాక్రమము లిప్పుడే తెలియఁగలవు. నీకు యుద్ధమందు నేర్పు కన్న, జారచోరాదికృత్యములయందుఁ గడుఁ బ్రావీణ్యమున్నది. ఇట్లంటి వని నీవు తలంప వలదు. వీనికి నిదర్శనము లనేకములున్నవి. చూడుము.

సీ॥ కొంటెవంచును దెల్ప ♦ గోపికాయువతుల
వస్త్రాపహరణమే ♦ ప్రబలసాక్షి
వరుస వావులులేని ♦ వాడవనుచు దెల్ప
మేనత్తరాధయే ♦ మేటిసాక్షి
పరమజారుడవంచుఁ ♦ బలుక షోడశసహస్ర
వనితా వివాహమే ♦ వరలుసాక్షి.
పరకాంతలకు నాస ♦ పడువాడవని చెప్ప
నే వలచిన రుక్మి ♦ ణి సతిసాక్షి

తే. గీ. నీచసతులఁగూడెదవని ♦ నిశ్చయింప
వక్రదేహయౌ కుబ్జయే ♦ పరమసాధ్వి
యింతకన్న నేమివలయు ♦ నెంచిచూడఁ
గాంచలేదందు నిక్కబోలు ♦ కలుషగుణుని.

శ్రీకృ—(కోపముతో) ఓరీ! శిశుపాలా!

ఉ. కాలము దాపరించుటను ♦ గానఁబోలు ప్రేలుచునుంటివిట్లు; భూ
పాలకులందఱున్‌గని సె ♦ బాసని మెచ్చఁగ నీదుకంఠ మీ
వాలునఁద్రుంచి నీకు దిద్రి ♦ వంబున సౌఖ్యముఁగూర్చువాడ నో
బాలిశ! యడ్డమై యెవరు ♦ వత్తురో నీకిపుడేరు జూచెదన్.

(కత్తిదూసి శిశుపాలునిమీదకి బోవును)

శిశు—రమ్ము. రమ్ము. నీమద మడఁగించెద.
(ఖడ్గముతో శ్రీకృష్ణునిహస్తముపై వేయును)

ద్రౌప—(తొందరగాఁబ్రవేశించి శ్రీకృష్ణునిఁజూచి) కృష్ణా! శిశుపాలుని ఖడ్గపు వ్రేటు హస్తమున నంగుష్ఠమునకుఁ దాకికాబోలు రక్తము స్రవించుచున్నది.
(చీరచెరగును చింపి చిన్నపెలిక కృష్ణునిఁవ్రేలునకుఁ గట్టును)

శ్రీకృ—(ద్రౌపదినిఁజూచి) సోదరీ! నీకీశ్రమయేల!

ద్రౌప—భగవంతుండవగు నీకు నే నుపకారముసేయుట శ్రమయా!

శ్రీకృ—మ. తరుణీ మెచ్చితి; నీదుసత్కరుణ యు ♦ ద్యత్ప్రీతిఁబుట్టించె; నీ
సరసాధ్వీమణులన్ జగంబునను నే ♦ సత్యంబుగాజూడలే,
దరయన్ నీకు శుభంబులున్ గలుగు, ని ♦ ష్టావాప్తిచేకూరు; మ
త్కరుణావర్షము నీపయింగురిసెయు న్నో ♦ కల్యాణి యెక్కాలమున్.

ఓ పాంచాలరాజనందినీ! నీ కాపత్సమయమున వలువ లక్షయమగునట్లు వరము బ్రసాదించితిని.

ద్రౌప—నందనందనా! మహాప్రసాదము. (నిష్క్రమించును.)

శ్రీకృ—(సభ్యులనుఁజూచి) సభ్యులారా!

చ. పటుతరశౌర్యశాలినని ♦ భావమునందున గర్వమూని దు
ర్ఘట కుటిలప్రలాపముల ♦ గ్రొల్కొని ప్రేలుచునున్నవాడు; వీ
డిటు వినియున్నవారుగద ♦ యింక సహింపఁగజాల గాన యీ
కుటిలునిఁబట్టి దుర్మద స ♦ కుంఠితలీలను జక్రధారచేన్.

(చక్రమునుబూని) ఇదిగో! సకల దైత్యగర్వనిర్భేదకమై, సకలామరమునిజన సేవ్యమై యలరారు మదీయచక్రము.వీనితలఁ దుంచుగాక.

(శిశుపాలునిపై జక్రము ప్రయోగించును.)

శిశు—హా! (నేలగూలును.) (తెర వ్రాలును.)

---

రంగము:—[సౌధముపై భీముఁడు ద్రౌపదియు నుందురు]
[ప్రవేశము:—దుర్యోధన కర్ణులు—]

భీమ:—పాంచాల రాజతనయా! శ్రీకృష్ణుని యనుగ్రహ విశేషమున నన్నగారొనర్చిన రాజసూయ మహాధ్వర మేకొంతయు లేక నిర్విఘ్నముగ సాగినది.

ద్రౌప—మాధవుఁడు మనపక్షమున నుండఁగా, మనకెట్టికొంతలును గలుగవుగదా! రాజసూయసవనార్థము మీరు జరాసంధుని, శ్రీకృష్ణుఁడు శిశుపాలుని వధించి యఖిలదిక్తట కీర్తినందినారు.

భీమ:—ప్రియసీ! చెప్పమఱచితిని. జరాసంధవధకేమిగాని శిశుపాలుఁడు మాత్రము, మహానిష్ఠాగరిష్ఠులై తపంబొనర్చు మునీంద్రులైనను బొందఁజాలని మహాపదము బొందినాఁడు. నిండుసభయందు శ్రీకృష్ణుని చక్రముచేఁగూలిన యాశిశుపాలుని శరీరమునుండి యొకదివ్యతేజము వెడలివచ్చి శ్రీకృష్ణుని శరీరమునఁ బ్రవేశించెను. (ఇంచుకయూరకుండి) అరుగో! దుర్యోధనకర్ణులు. మయసభా విచిత్రముల నరయుటకుఁ గాబోలు నిట్లువచ్చినారు.

దుర్యో—(కర్ణునిఁజూచి) కర్ణా! ఈమయసభ యెంత విచిత్రముగఁ జిత్రింపఁబడినదో కంటివా? ఇట్టిసభ మున్నెన్నఁడును జూచియుండలేదని సభ్యులు చెప్పుకొనిరి. దీని నిర్మించుట కామయునకే తగియున్నది. ఇటురమ్ము. మనమీద్వారమునఁ బోవుదము. (ముందునకునడచి తలవంచి) ఏమిదీ! ఇచ్చట ద్వారములేదే! ఈ నిర్మాణకౌశల్య మెంతయు వర్ణనీయముగదా!

కర్ణు—రారాజా! ఇటురమ్ము. ఈవివృతంబైన ద్వారప్రదేశమునఁ బ్రవేశింతము.

దుర్యో—(నడువగా ద్వారము శిరమునకుఁదగులును) అబ్బా! కర్ణా! సంవృతద్వారమునుగాంచి వివృతంబని ప్రవేశించితిమి. శిరముగూడ బగిలినదే.

భీము—కాంతా! దుర్యోధనుఁ డీసభయందు దిదియని గుర్తింపలేక యున్నవాఁడు.

దుర్యో—కర్ణా! అదిగో! నీలాశ్మస్థగితంబైన విమలమణిస్థలము సరయుదము రమ్ము.

(నడిచి జలాశయమునఁ బడును)

ద్రౌప—(నవ్వును)

దుర్యో—(లేచి) ఏమి! మనకీ పరాభవము. ఇయ్యది జలాశయముగా గుర్తింపలేక, యిందు బడితిమి. అందుచే ద్రౌపది నన్ను రారాజనియైన దలపక నవ్వెను.

భీము—ద్రౌపదీ! దుర్యోధనుని వస్త్రములు తడసినవి. సేవకునిచే వస్త్రంబులఁ బంపెదగాక.

దుర్యో—కర్ణా! సభాచిత్రము లరయుట యింకఁజాలును. రమ్ము.

(నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము

---

# ద్రౌపదీవస్త్రాపహరణము.

## తృతీయాంకము.

రంగము:—[హస్తినాపురము.- మందిరమున నొంటిగా విచారముతో దుర్యోధనుఁడు ప్రవేశము]

దుర్యో—(తనలో)ఆహా! ఏమి! ఆపాండవుల వైభవము.

ఉ. పాండునృపాలనందనుల ♦ వైభవమెంతయు హెచ్చిపోయి యా
ఖండలు మించియుండి తిరిజ ♦ గంబులఁ బ్రాకె యశోలతాళి, భూ
మండలనాయకుల్ గడుస ♦ మంచితభక్తిని గొల్చుచుండి రా
పాండుసుతాగ్రజుం భళిర ♦ భాగ్యమనంగను నద్దియేకదా.

మాతండ్రిచే నర్థరాజ్యంబుఁ బ్రసాదింపబడి నిన్న మొన్న నింద్రప్రస్థపుర సింహాసన మధిష్ఠించిన ధర్మనందనుఁడు చూచుచుండఁగనే యెంతవాడయ్యెను! పాండవు లిట్టి వైభవోపేతులై యుందురని నేనెన్నఁడైన దలంచియుంటినా? పాండుకుమారవినాశనమునకై నేను బాల్యమునుండియు యత్నించినను గొనసాగదయ్యె. రాజసూయమహాధ్వర మొనర్చుటచే ధర్మసుతునకు, జక్రవర్తిత్వము స్థిరపడినది.

తే. గీ. సకలదిగ్దేశరాజులు ♦ సంతసమున
నిండు పేరోలగంబున ♦ నెగడు ధర్మ
నందనుని గొల్చుటదిచూడ ♦ డెందమందు
నచ్చెరువుదోఁచె నెంతయు ♦ నహహా! నాకు.

మ. ఉదయాస్తాచలసేతు శీత నగమ ♦ ధ్యోర్వీశబృందంబు; స
మ్మదమొప్పన్ కరులున్ రథంబులు హయం ♦ బుల్ రత్నముల్ బెక్కుసం
పదలుం గానుకనిచ్చి ధర్మసుతసే ♦ వాలోలురై యుంట, నా
మదికెంతేనియు వింతదోఁచె జగతిం ♦ భాగ్యంబు వేరున్నదే.

ఆతఁడు చేసిన రాజసూయ యాగమునకు ధనంబొసంగని భూపాలుఁడొక్కఁడును లేడు. ఆహా! ఏమి! ఆ రాజసూయ మహాధ్వరమహోత్సవ కార్యక్రమము.

తే. గీ. మఖము నీక్షింపవచ్చిన ♦ మౌనివరులు
సకల భూపాలచంద్రులు ♦ జనులుగూడ
నిట్టి రాజసూయమఖంబు ♦ నెచటఁ జూచి
యుండలేదని వచియించి ♦ రొప్పుగాను.

మున్ను హరిశ్చంద్రాది సార్వభౌములుగూడ జేసిన యాగ మింత వైభవముగా జరిగియుండలేదని మునీంద్రులు తమలోఁ దాము చెప్పుకొనిరి. (ఇంచుక యూరకుండి) రాజసూయాధ్వరము జూచివచ్చిన నాటనుండియు నాచిత్తమున నొక విధమగు వికారముజనించి పీడించుచున్నది. ఆ ధర్మనందనుని సామ్రాజ్య వైభవముఁ జూడ నాకన్నుఁ గుట్టినది.

తే. గీ. మహితపాండుకుమార సా ♦ మ్రాజ్యలక్ష్మి
నపహరింపంగవలె నెట్టు ♦ లైనఁ గాని
గాకయుండిన నాకునీ ♦ క్ష్మాతలమున
బ్రదికియున్నందులకు నేమి ♦ ఫలము గలదు.

నే నెట్లయిన నీవిషయమునఁ బట్టుదలఁబూని పనిసేయవలయును.

[శకుని కర్ణుఁడు- ప్రవేశము]

శకు——కర్ణా! ధర్మనందనుని రాజసూయమహాధ్వరము జూచివచ్చిన నాటనుండియు దుర్యోధనుఁడు మనతో మనసిచ్చి మాట్లాడుటలేదు. ఇందుల కేమికారణమై యుండును?

కర్ణు——నిజమైన కారణము నేనును నూహింపఁజాలను. కాని, రాజసూయాధ్వరానంతరమున మేమిరువురమును మయసభాచిత్రింబులఁ దిలకించుచుండఁగా నొకచోట, జలపరిపూర్ణమగు కాసారమును జూచి జలములేదని తలంచి దుర్యోధనుం డందు దిగినంతనే వలువ తడిసెను. ఇదియంతయు సౌధాగ్రమున భీమునితోనున్న ద్రౌపదిచూచి నవ్వెను. ద్రౌపది నవ్వాతనికి హృదయవేదన గలిగించెను. అదియే కారణమేమో!

శకు——ఆవిషయమై యింతగాఁ జింతించునని తోఁచదు. ఈతని మనంబున నేదియో యొక గొప్ప బెంగయే కలిగినది.

కర్ణ—(ఎదుటఁజూచి) ఇదుగో! కౌరవేంద్రుఁ డొంటిగ నేదియో విచారించుచున్నాఁడు. మనకు సర్వమును నిప్పుడే తెలియునుగదా! రమ్మా.

(దుర్యోధనుని సమీపింతురు)

దుర్యో—(శకునికర్ణులనుజూచి) మిత్రమా! కర్ణా! మామా! శకునీ! వచ్చితిరా! ఇటఁ గూర్చుండుఁడు.

(శకునికర్ణు లాసీనులగుదురు)

శకు—(దుర్యోధనునిఁజూచి) అబ్బాయీ! దుర్యోధనా! ఇంద్రప్రస్థపురమునుండి వచ్చినది మొదలు మాతో మాటలాడకుంటివి. నీ ముఖబింబము నిశియందుఁ బద్మమట్లు వాడియున్నది.

దుర్యో—మామా! నా విచారమునకు గారణము నేమనిచెప్పుదును?

శకు—సుయోధనా! నీకు సంతాపమేఁ?

సీ. పాలించుచున్నావు ♦ భరతఖండము నెల్ల
భూపాలకుల్ నీకు ♦ మ్రొక్కుచుండఁగ
రాజిల్లుచున్నావు ♦ రమ్యభాగ్యముతోడ
నమరసంతతిగూడ ♦ నద్భుతపక్ష
దూలింపుచున్నావు ♦ దుర్మదశాత్రవ
వీరులఁబ్రజలెల్ల ♦ వేడ్కఁబొగడ
విలసిల్లుచున్నావు ♦ వీరప్రతాపులౌ
సోదరశతముతో ♦ శోభఁగాంచి

తే. గీ. యింతయేనియుఁ గొఱంత లే ♦ దెంచిచూడ
స్వాంతమందున వగపేల ♦ సంభవించె
వినదగినవాడనేని వే ♦ వేగనీవు
కారణంబును జెప్పుమీ ♦ కౌరవేంద్ర.

కర్ణ—చ. భరతకులప్రదీపుఁడవు ♦ బాహుపరాక్రమ శౌర్యవిక్రమ
స్ఫురణజరింపుచుంటి వరి ♦ భూపతులెల్లరు నీకు మ్రొక్క, సో
దరశతమెల్లవేళలను ♦ దద్దయు భక్తినిగొల్వ; నేల, యీ
సరణి విచారమందెదవు ♦ స్వాంతమునన్ వచియింపుమీ నృపా.

చ. అరినరనాథు లేరయిన ♦ నంచితసాహసమూని నీపయిన్
బరువడి రాదలంచిరొకొ ♦ భండనమున్ బొనరింపఁగోరి; యా
సెరగ నిజంబెయైనను మ ♦ దీన్భయమొందఁగనేలభూవరా
యరినరనాథభీకరత ♦ రాలుపఁగాల్చెడి కర్ణుఁడుండఁగన్.

తే. గీ. రాజచంద్రుండవౌ నీకు ♦ రాధసుతుఁడు
బరమసఖుఁడై నటంచైన ♦ భావమందు
దలపకే సాహసించి యే ♦ ధరణిధవుఁడు
వచ్చు నీపైకి నానిద ♦ ర్పంబడంతు.

శకు—రాధేయా! రారాజగు సుయోధనునిపై కెత్తిరా నెవ్వఁడు సాహసించును?

దుర్యో—(శకునిఁజూచి) మామా! నాపైకెత్తి వచ్చునంతటి సామర్థ్యమున్న శత్రువులెవ్వరు? నాకట్టి భయముగాని, చింతగాని యంతరంగమున లేను.

శకు—అట్లయిన నీచింతకుఁ గారణం బెఱింగింపుము.

దుర్యో—మామా! నీవు యుధిష్ఠిరునకు మయుండొసంగిన సభను దిలకించితివి కదా! అట్టిదీ భూలోకమున నెచ్చటనైనఁ గలదా! మహీచక్రమునఁగలఁ రాజు లెల్లరను భయమందుచు రాజసూయాధ్వరనిమిత్త మెంతయో ధనము నిచ్చిరి. అది యట్లుంచుము.

ఉ. ఈవును జూచినావుగద ♦ యెంత విచిత్రముగాఁగనుం... సి
భూవలయంబునందు గల ♦ భూవరులెల్లరు సంతసించి ధా
త్రీవిభు ధర్మనందనుని ♦ బ్రీతినిగొల్చిరి జక్రవర్తిగా
భావములం దలంచుచును ♦ భాగ్యము నేమనవచ్చు మాతులా.

మాతులా! వేయేల! పాండవుల ధనసంపదలఁజూచి సహింపఁ జాలకయుంటి. ఇది యట్లుంచుము.

మ. దశదిగ్భాగములన్ బ్రతాపమహిమల్ ♦ దట్టంబుగానిండ, మేల్
యశమున్ గైకొని సంచరించెడు సము ♦ ద్యద్భూరితేజుండు నా!
శిశుపాలున్ సభయెల్లజూడగ శిర ♦ శ్ఛేదంబుగావింప నా
పశుపాలుంగని యూరకుండిరి భయ ♦ భ్రాంతాత్ములై యందఱున్.

ఒక్కఁడైనను గృష్ణుని నెదిరించినవాఁడు లేడు. ఇది యంతయు ధర్మనందనునియదృష్టము. నే నెట్లయినను వారిభాగ్యలక్ష్మిని నపహరింపవలయును. మామా మానధనాఢ్యుఁడైన యే భూపతి యిట్టిదిచూచి సహింపఁగలఁడు? ఏవిధంబున నేనా పాండవుల లక్ష్మినిహరింపఁగల్గుదును? ఈవిషయమే నిరంతరము నామనంబును బాధించుచున్నది.

కర్ణ—రారాజా! ఇదియా నీకుగలిగిన పరితాపము. నేనేమో యనుకొంటిని. దీనికై నీవు విచారింపనేల!

చ. సెలవిడిపంపుమీ యిపుడె ♦ చెచ్చెఱ నేఁజని పాండుపుత్రులన్
గలననునోర్చి నీదుపద ♦ కంజసమీపమునందు నుంతు వా
రల ధనలక్ష్మియంతయు వి♦రాజిత విక్రమమేర్పడంగ; నన్
బిలువగవద్దు కర్ణుఁడను ♦ పేరిట నట్టులు సేయకుండినన్.

దుర్యో— అంగరాజా! నీవంతటివాడవనుటకు సందియము లేదు. కాని యిప్పుడు మనము వారితో నకారణముగఁ బోరాడితిమేని, వారి సంపదనుజూచి యోర్వలేక యిట్టికార్యము దుర్యోధనుఁ డొనరించెనని నింద నాపైఁబడును. లోకు లేవిధమైన యనుమానమును బూనకుండ సులభోపాయమున వారి రాజ్యశ్రీల నపహరింపవలయును.

చ. అది యొనరింపకున్న హితు ♦ డా! విను నాదగు మానసంబునం
దొదవదు శాంతి యే కరణి ♦ నొప్పుగ పాండుకుమార భాగ్యసం
పదల హరింపఁగల్గుదును ♦ బంధుజనంబులు మెచ్చునట్లు; నా
మదికి విచారమయ్యె యను ♦ మానము లేక వచించితిన్ సుమా.

(శకునిఁజూచి) మామా! గాంధారరాజా! మేనయల్లుని చింతఁబాపుటకు నీవ తగినవాఁడవు. నీయొద్దనున్న యుపాయములు మఱియెవ్వరి యొద్దను లేవు. కావున నాయందు దయాంతరంగుఁడవై యుపాయములేని యుపాయముఁ జెప్పి, పాండవ రాజ్యలక్ష్మిని నన్ను వరించునట్లుచేసి నాచింతఁబాపుము. లేదేని యీచింతతో నేను కృశించి పోవుదును.

శకు— దుర్యోధనా! నీవు వగవం బనిలేదు. నీసౌఖ్యమే నాసౌఖ్యము.

చ. బరువడి మాయజూదమునఁ ♦ బాండుకుమారుల భాగ్యలక్ష్మి నే
కరణినినైన నీకిడెద ♦ శౌర్యబలంబులతోఁ బనేమి; సం
గర మదియేల! యియ్యదియె ♦ కాఁగలకార్యము చెప్పినాడ నో
కురుకులనాథ చిత్తమునఁ ♦ గుందక యత్నము సేయుమీ వెసన్.

అబ్బాయి! ధర్మనందనుఁడు ద్యూతప్రియుఁడు. అతనిని మన మెట్లులైన రావించి జూదమునఁ బ్రవేశింప జేసితిమేని కార్యము చక్కబడినట్లే. ఈవిషయమై యాతనిం బిలిపించుటకు నీ వెట్లయిన నీతండ్రిని సమ్మతింపఁ జేయవలయును.

కర్ణ— రారాజా! శకునియుపాయము కడుఁ జక్కగనున్నది.

దుర్యో—(శకునింజూచి) మామా! జూదమాడుటలో నీకెవ్వరును నీడుగారు. నీవు నిశ్చయముగా దలంచితివేని మాయజూదమునఁ బాండవరాజ్యలక్ష్మి నన్నుఁ జేరునట్లు జేయఁగలవను ధైర్యము నాకున్నది.

శకు— సుయోధనా! నీవు సందియమందవలదు. ఎట్టయినను జూదమున పాండవుల రాజ్యలక్ష్మి నోడిసి నీకర్పించెద. ఇంక నీ విషయమై మీ తండ్రితో నాలో చింతము రమ్ము.

దుర్యో—(కర్ణునిఁజూచి) కర్ణా! నే నీ విషయమునఁ దండ్రితో యోజించి యాతని నెట్లయిన సమ్మతిఁబఱచి వచ్చెద నీవు గృహంబున కరుగుము.

కర్ణ—మంచిది. (నిష్క్రమించును.)

[దుర్యోధనుఁడు-శకుని-నడుచుచున్నారు. తెర లేచును]
(ధృతరాష్ట్రుఁడు సంజయుఁడు-ప్రవేశము)

ధృత—సంజయా! రాజసూయ మహాధ్వరము జూచివచ్చిన నాటనుండియు దుర్యోధనుఁడు నాకడకురాక యెందులకో దీర్ఘవిచారతత్పరుఁడై యున్నవాఁడట. ఇందులకుఁ గారణము నీకేమైనఁ దెలియునా?

సంజ—కారణముమాత్రము నాకుఁ దెలియదు గాని యాతనిముఖము మిగుల దీనభావము వహించియున్నది. (ఎదుటఁజూచి) అదుగో! దుర్యోధనుఁడు శకునితో భవత్సందర్శనార్థమై వచ్చుచున్నాఁడు.

(దుర్యోధనుఁడు-శకుని-ధృతరాష్ట్రుని సమీపించుదురు)

దుర్యో—తండ్రీ! నమస్కారములు.

ధృత—వత్సా! ఇటురమ్ము. నీకుఁగుశలమే కదా!

దుర్యో—కుశలమున కేమి కొఱత. కాలమెట్లో గడచి పోవుచున్నది.

ధృత—కుమార! అట్లు వచించెద వేమి! నీకే మిఁకొఱంత కలిగినది?

శకు—(దుర్యోధనునిఁజూచి) రారాజా! ఈయనవసరమైన మాటలతో నేమి పని యున్నది? నీమనోవేదనకుఁ గారణము నీతండ్రికిఁ జెప్పుము.

ధృత—కుమారా! నీకుఁగూడ మనోవేదనయేనా? హస్తినాపుర సామ్రాజ్యలక్ష్మికి భర్తవై సర్వభూతలమును నేకచ్ఛత్రముగఁ బరిపాలించుచుంటివి నీయనుచరులును, దమ్ములును, మిత్రులును నీయందధికప్రీతినిఁ బూనివర్తించుచుండిరి. దేవవిభునితో సమానముగ సకలభోగముల ననుభవించుచుంటివి. భూపతులెల్ల నీకరిగాపులై సేవించుచుండిరి. ఇంక నీకుఁగొఱంతయేమున్నది? నీవిచారమునకుఁగారణమేమి?

దుర్యో—తండ్రీ! నీయొద్ద దాచనేల! పాండవుల విభవము శచీశునికన్న నత్యధికమై యున్నది. వారియశము నలుదిక్కుల నిండినది. ఎవ్వరికిని జయింప నలవిగాని యుత్తరకురుభూములను నర్జునుఁడు జయించినాఁడు. సఖ్యసంబంధముండిన కారణమున, శ్రీకృష్ణుఁడును ద్రుపదుఁడును దప్ప, దక్కిన రాజులలో బాండవుల కరిఁ బెటనివారు లేరు. వసుమతీచక్రమంతయు వారి వశమైయుండఁగా రారాజునైన నేనుదీనినిఁజూచి యెటుసహింప నేర్తును? ఆరాజసూయమహాధ్వరము వర్ణించుటకు శేషునికైనఁ దరముఁగాదు. నానా దేశనృపాలురును యుధిష్ఠిరునకనేక కానుకలొసంగిరి. వేయేల!

చ. ధరఁగలరాజులెల్లరును ♦ దద్దయుఁగొల్వ యుధిష్ఠిరుండు; శ్రీ
హరికృపచేత భాగ్య మమ ♦ రాధిపుమించెడి రీతిగాంచి సు
స్థిరముగనుండె యాగములఁ ♦ జేయుచు; నిట్టివిధంబుగాంచి యే
కరణిని సైపఁగాఁగలను ♦ ఖ్యాతలసాధ విచారమందెదఁగా.

ధృత—వత్సా! ఇదియా నీకుఁ గలిగిన చింతకుఁ గారణము. ఎంత వెఱ్ఱివాడవు. పాండవులట్టి వైభవముతోఁ దులదూగుచుండినందులకు సంతోషించుటకు మారుగాఁ జింతించెదవేల! వారు నీకన్యులా! వా రెప్పుడును నాయందధిక భక్తి విశ్వాసములఁగలిగి నడలుచుందురు.

సీ. ధర్మవ్రతాచార ♦ ఘోరేయుఁడౌచును
దద్దయు వెలుగొందె ♦ ధర్మసుతుడు
భీమప్రతాపుఁడై ♦ వెలలేని యశమందె
బలశాలియైనట్టి ♦ వాయుసుతుఁడు
రాజాధిరాజుల ♦ నాజులందునఁగెల్చి
ఖ్యాతిమైమించెను ♦ నర్జునుండు
నన్నులకొక్కింత ♦ యైనను దీసిపో
వక యొప్పుచుండ్రి మా ♦ ద్రి కొమరులిల

తే. గీ. వారు నీవారుకారె;భా♦వమునఁదలఁప
చింతయేలందువే! యవ్వారి ♦ సిరులఁజూచి
బెల్లపై యిట్లుపలుకఁగా ♦ నేల! చాలు
విన్న నెవరైన నవ్వరె! ♦ పృథ్విజనులు.

శకు—(తనలో) ధృతరాష్ట్రు డిట్లుపలుకుచున్నాఁడేమి! నేను పన్నినతంత్రము సాగదాయేమి? కానిమ్ము. చూచెదఁగాక.

దుర్యో—(తండ్రినిఁజూచి) తండ్రీ! నీవట్లు పలికెదవు. నేను వచించుసంగతి బాగుగ విని యనంతరకర్తవ్య మాలోచింపుము. అమ్మహాధ్వరమున నొక లక్ష భూసురులు భుజించినగాని మ్రోయనిఘంట నిరంతరమును దనకుదానే మ్రోయుచుండెను. ఆ పాంచాలరాజతనయనుగూర్చి నేనేమని చెప్పుదును. యజ్ఞార్థమై వచ్చినవారెల్ల భుజించిరో లేదో యరసి, తాను స్వయముగా భోజనమిడి, యర్ధరాత్రి సమయమునఁగాని యామె భుజింపకయుండెను. మున్నుహరిశ్చంద్రాది చక్రవర్తులు చేసిన యధ్వరంబులుగూడ ధర్మజుని రాజసూయముతో సరిరావని మునులు మిగుల శ్లాఘించిరి. తండ్రీ! వేయేల! వారి భాగ్యలక్ష్మిని గాంచి సహింపఁజాలకపోయితిని. దాని నట్లయిన హరింపవలయును.

శకు—వత్సా! ఇందులకై నీవు విచారింపకుము. ఆధర్మరాజు జూదమునం దతిప్రీ

యుఁడు. కావున జూదమున నాతని నోడించి యాభాగ్యము నీకుఁ గూర్చెదఁ గాక!

దుర్యో—తండ్రీ! నాయందుఁ గృపాంతరంగుఁడవై శకునిమతమున కంగీకరింపుము.

ధృత—మ. తనయా! పాండుకుమారులెప్పుడును నా ♦ దైత్యారిపాదంబు స
జ్జనులెల్లన్ మతియింపగా దనరుచున్ ♦ సత్యవ్రతాచారులై
మనుజేంద్రుల్ గొలువన్ యశంబుగనుచుం ♦ భాసిల్లుచున్నారు! నీ
మనమందదిగతి వారిపై బగవహిం ♦ పంజెల్లునే యెంతయుఁ.

తే. గీ. ధర్మజుని సత్యసంధత ♦ ధరణియందు
వేయినోళ్లఁ బొగడబడి ♦ వెలుగుచుండ
నట్టివానిపై నీవిట్టు ♦ లాత్మయందు
పగవహింపగ నేటికి ♦ వలదు వలదు.

కుమారా! నీకీబుద్ధియేల జనించినది ఇట్టిసాహసము వలదు. నామాటవినుము.

దుర్యో—తండ్రీ! శకుని వచించినమాట ధర్మశాస్త్రవిరుద్ధముగాదు. పరరాజులను యుద్ధమునందుగాని, జూదమునందుగాని జయించి తద్రాజ్యశ్రీల నపహరించుట వీరక్షత్రియ ధర్మమేగదా!

ధృత—(తనలో) వీడు పాండవులరాజ్యలక్ష్మినిగాంచి మిగుల నసూయవహించి యున్నాఁడు. వీనిబుద్ధి మఱలించుటకు నావశముగాదు. అయినను నిట్లు చెప్పి చూచెదఁగాక! (ప్రకాశముగా) తండ్రీ! ఈవిషయమై బృహస్పతితోఁ దుల్యుఁడును, నీతిశాస్త్రపారంగతుఁడును, సకల ధర్మశాస్త్ర విదుండును నగు విదురునితో, నాలోచించెదఁగాక! ఆతని బుద్ధిబలమునను, గాంగేయుని భుజబలంబుననుగదా మన రాజ్యలక్ష్మి వర్ధిల్లుచున్నది.

దుర్యో—తండ్రీ! విదురునితోడనా యాలోచన.

తే. గీ. పాండుపుత్రుల కెప్పుడు ♦ పక్షపాతి
విదురుడని చెప్ప తొల్లి నే ♦ వింద దీని
నెరిగి వారించుగా కత ♦ డేల శకుని
కైతవంబున కొడఁబడు ♦ గార వేశ.

ధృత—కుమారా! నే నొక్క మాటఁజెప్పెదను వినుము. నీవు పాండవుల కంటె నెక్కువ భాగ్యముతోఁ దులఁదూగుచున్నావు. నీవునుధర్మజుని సభను మించు చిత్రమైన సభను నిర్మింపఁజేసి రాజసూయము సేయుము. రాజులెల్లరు నీకును ననేక కానుక లర్పింతురు. నీవు తలంచిన జూదమువలన నీకును వారికిని వైరము గలుగును.

ఉ. ఇమ్మహి నీవు వారలును ♦ నెప్పటియట్లు పరస్పరానురా
గమ్మునమనుంట మేలగును ♦ గాని, చలంబువహించి వారి భా

గమ్ము హరింపనేటికి జగంబు హసింపదె నిన్ను జూచి సా
ఖ్యమ్మున నుండుమీ యికను ♦ క్ష్మాతలనాథులు నిన్నుఁ గొల్వఁగన్.

పెద్దలయిన భీష్మద్రోణు లిందుకు సమ్మతింపరు.

దుర్యో—రాజేంద్రా! యీమాట లేల! ధర్మజునితో జూదమాడుటయే నేను యజ్ఞము జేసినట్లుగను, సమస్తైశ్వర్యములును బడసినట్లు భావించెదను. రాజసూయాధ్వరానంతరమున నేనా ధర్మజుని దివ్యసభావిశేషంబుల దిలకింపుచు నొకచోట జలజాకరమున్నదని హరినీలబద్ధస్నిగ్ధమణిస్థలమునందు వలువ నెగయగట్టి యొకచోట విమలమణిశిలాతలముగా భావించి యుదకపరిపూర్ణంబగు నొక సరోవరమునఁ బడితిని. అప్పుడు వస్త్రంబులన్నియుఁ దడిసినవి. ఆ సమయంబున సౌధతలంబున భీమునితో నున్న ద్రౌపది నన్నుఁ జూచి నవ్వెను. అది నాకు హృదయశల్యమై యున్నది. కాలవశంబునఁ బెద్దలు హీనత బొందినారు. హీనులు పెద్దలైనారు. సుఖమైన యుపాయంబున బరరాజ సంపదలఁ గొనుటకన్న రాజులకుఁ బురుషార్థ మేమికలదు? ఎట్లయినను నేనా పాండవరాజ్యలక్ష్మిని హరింపవలయును. అది సేయనైతినేని నా హృదయరోగమునకు శాంతి కలుగదు.

శకు—దుర్యోధనా! నీవు విచారింపవలదు. రథాశ్వసన్నాహమేమియు లేకుండ, యొద్ధనంబులు దీర్చకుండ నుభయసైన్యములు దలపడి కలహింపకుండ నే నశ్రమముగా పాండవ రాజ్యలక్ష్మిని నీకుఁ గూర్చెదనని నమ్ముము.

దుర్యో—తండ్రీ! ఇందుల కానతిమ్ము.

ధృత—వత్సా! మించిపోయిన దేమున్నది. అర్థానర్థవిదుండును, సకలకార్యసమర్థుండును నగు విదురానుమతమున బ్రవర్తింతము.

దుర్యో—తండ్రీ! నీ కిదియేమి వెఱ్ఱి. నీవు స్వతంత్రుడవు. నిన్ను గాదనువా రెవ్వరు. విదురుఁ డెప్పుడును బాండవపక్షపాతి.

తే. గీ. అప్పుడంచును నీవెప్పు ♦ డాత్మలోన
దలపుచుందువు విదురుని ♦ లలితచరిత
పాండుసుతులందు నాతని ♦ భావమెపుడు
దగిలి వర్తింపుచుండును ♦ ధరణినాథ.

అది యట్లుంచుము. ఈ జూదమువలనఁ గలత యేమియు సంభవింపదు. వినోదార్థ మేర్పడినదని చెప్పుదుము. మనము శిల్పాచార్యులచే నొక్క యపూర్వసభను నిర్మింపజేసి, పాండవులను నత్సభావైచిత్ర్యంబుల వీక్షించుటకై రావింతము. ఇందులకు నీవన్యథా దలంపక యంగీకరింపుము.

ధృత—(తనలో) ఇప్పుడు నేనేమి సేతుదును? ఈతఁ డకారణముగఁ బాండవ రాజ్యలక్ష్మి నపహరింపఁదలంపుచున్నాఁడు. నేనెంత చెప్పినను వినఁడయ్యెను. ఇందులకు

నేనంగీకరింతునేని భీష్మాదులు నన్ను దూషింతురు. కానిమ్ము. పుత్రవాత్సల్యము ద్రోసి వేయంజాలను. (ప్రకాశముగా) కుమారా! నీ కింతసాహసమేల! నీయిష్ట మెట్లో యట్లే కానిమ్ము. శిల్పాచార్యులను రావించి సభానిర్మాణ మొనరింపం జేయుము పాండవేయులను నేను రావించెదను.

దుర్యో—(తనలో) ఇప్పటికి నాకానందము గలిగినది (ప్రకాశముగా) జనకా! నాకా జ్ఞనిమ్ము. సభానిర్మాణోద్యోగమున వర్తింపవలయును.

ధృత—మంచిది.

దుర్యో—(శకునితో నీవలకువచ్చి) మామా! ఇతని నెట్లో యొప్పించితిమి; ఇకం జరుగవలసిన కార్య భారమంతయు నీపైనున్నది.

శకు—శా. సందేహం బొకయింతలేదు వినుమా ♦ సర్వంసహామండలం
బందున్ గల్గిన రాజులెల్లరు నతిం ♦ పన్ మాయజూదంబు నీ
వెందున్ జూడనిరీతి నాడి వినుమీ ♦ వేగంబె నీకిత్తు నా
నందాంభోధినిమున్గ? పాండుసుత రా ♦ జ్యశ్రీని దుర్యోధనా.

మాయ జూదమాడుటయందు నన్ను మించినవాడు లేడనుసంగతి నీవెఱింగియే యుంటివి. ఈవిషయమున నీవు సంశయింపం బనిలేదు. ఇంకనీవు నీప్రయత్నమున నుండుము. (నిష్క్రమింతురు.)

ధృత—సంజయా! సంజయా.

సంజ—(ప్రవేశించి) మహారాజా! ఏమి సెలవు?

ధృత— నీవరిగి విదురుని దోడ్కొనిరమ్ము.

సంజ—(చిత్తము.) (నిష్క్రమించును)

ధృత—(తనలో) దుర్యోధనుండు తలంచినయీ జూదము తుదకెట్లుగాం బరిణమించునో తెలియకున్నది. నేనెట్టి నిందను భరింపవలయునో యని డెందంబున మిగుల సందియము గలుగుచున్నది.

విదు—(ప్రవేశించి) ధృతరాష్ట్రమహీపాలా! నన్ను రావించిన కారణమేమి?

ధృత—నయకోవిదా! విదురా! వచ్చితివా! ఇటం గూర్చుండుము.

విదు—(ఆసీనుఁడగును)

ధృత—విదురా! ధర్మజుని సభ దిలకించిననాటనుండియు మన దుర్యోధనున కట్టిసభ యుండవలెనని యభిలాష కలిగినది. అందుచే నాతఁడు శిల్పాచార్యులచే నొకసభను నిర్మింపంజేయును. దానిం దిలకించుటకు నీవు పాండవులను రావింపవలయును. ఆ యపూర్వసభాభవనంబున దుర్యోధనుఁడు ధర్మనందనునితో, వినోదార్థము జూదమాడునట.

విదు—(తనలో) దుర్యోధనుఁడేదియో కుతంత్రమును బన్ని యీతనిని సమ్మతింప జేసియుండును. (ప్రకాశముగా) కౌరవ వంశవర్ధనా! నీవు సకల ధర్మాధర్మ సంవేదివి. నీకుఁ దెలియని విషయము లెందును లేవు. మనదుర్యోధనుఁడు తలఁచి నజూదము ముందు వినోదార్థముగనే యేర్పడి తుదకు గలహాముగాఁ బరిణమించును. శకుని ప్రోద్బలంబున సుయోధనుఁ డిట్టికార్యము జేయఁదలఁచినాడని యూహించెదను. ఇట్టి యుద్యోగమును నీవు వారించి కురువంశము రక్షింపుము లేదేని దీనంజేసి కురుపాండవులకుఁ గలహము వాటిల్లును.

ధృత—విదురా! ఈ విషయమున నీవు సందియమందఁ బనిలేదు.

సీ. మన యభివృద్ధినే ♦ మానసంబునగోరు
సత్కృపాశాలియౌ ♦ శాంతనవుఁడు
సకల ధర్మంబుల ♦ సరణి నరయు మహా
త్ములు శాంతచిత్తులు ♦ ద్రోణకృపులు
సతతంబు తనయుల ♦ సౌఖ్యంబు వాంఛించు
కారుణ్యనిధి వౌదుఁ ♦ గాన నీవు
నాపద రాకుండ ♦ గాపాడ జూచుచు
నతిజాగరూకత ♦ నరయు నేను

తే. గీ. గలిగియుండ గొంతయేమి ♦ కలుగునయ్య
కలహమేటికిఁ బ్రాప్తించు ♦ గాంచెదేల
సందియము; వినోదార్థమై ♦ జరుగు జూద
మగుట సమ్మతింపుము దీని ♦ కలఘచరిత.

నూతనసభానిర్మాణము పూర్తియైనంతనే పాండుకుమారులనిటకుఁ దోడ్తోనిరమ్ము.

విదు—(తనలో) ఈ యంధనృపాలుఁడుగూడ కొమరుని మతమునకు సమ్మతించి నాఁడే. ఈతఁడు నిశ్చయముగా వారించెనేని దుర్యోధనుఁడేల యీతని యాజ్ఞకు బద్ధుఁడుగాకుండును. నేనిక యేమిచెప్పినను బ్రయోజనము లేదు. కురుకులేశ్వరునకు దుర్బుద్ధులు హెచ్చుచున్నవి. కలికాల మాసన్నమగుచున్నది. కౌరవకులనాశనభూజమునకీ జూదము బీజముగాఁ బరిణమించునేమో యను యనుమానము వొడముచున్నది. కానిమ్ము. భగవంతుఁడున్నాఁడు. (ప్రకాశముగా) రాజేంద్రా! నీయిష్టమెట్లో యట్లే కానిమ్ము.

ధృత—ఇంక మన మరుగుదము. సంజయా! రమ్ము. (నిష్క్రమించుచున్నారు.)

ఇది తృతీయాంకము.

---

# ద్రౌపదీవస్త్రాపహరణము.

## చతుర్థాంకము.

రంగము:—(ఇంద్రప్రస్థపురము:—ధర్మరాజు సభామందిరము ముందు విదురుని ప్రవేశము.)

విదు—(తనలో) ఔరా! దుర్యోధనునకు, ధర్మచరిత్రాచారపాలకులగు పాండవులనిన నెంతయసూయ కలిగినది. ఈయసూయకు వారి రాజసూయాధ్వరమే కారణముకదా! (దుర్యోధను నుద్దేశించి) దుర్యోధనా!

తే. గీ. ఎన్నడైన బాండుకొమరు ♦ లింతయైన
యపకృతిం జేసిరే? నీకు ♦ నట్టియెడల
వారిపై నిట్లసూయ భా ♦ వంబుపంచు
దాల్పగానేల నీవును ♦ ధర్మరిపువ.

నీ దుష్టబుద్ధికిఁదోడు శకుని యొకఁడుండెను. మాయామయు రోదరి మాంస దలంచుట కాతని ప్రేరేపణయే కదా! ఆలోచించి చూడఁగా దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు, కురుకుల నిర్మూలనమునకై జనించిరని చెప్పవచ్చును. (ఇంచుక యూరకుండి) ఇందు వృద్ధుండగు ధృతరాష్ట్రుఁడు మాత్రము చేసిన మంచి యేమున్నది. (ధృతరాష్ట్రు నుద్దేశించి) ఓయీ! ధృతరాష్ట్ర మహీపాలా!

చ. తనయుఁడు సేయు దౌష్ట్యము, సు ♦ ధర్మచరిత్రులు మెచ్చఁగా నివా
రణ మొనరింప కీగతిని ♦ రమ్యచరిత్రుల పాండుసూను సం
గ్గును దలపోసినావుగద ♦ కుత్సితబుద్ధిని దీనిఁజూచి స
జ్జనములు మెత్తురే నిను, య♦శంబును గల్గునె యెంతయేనియున్.

ఇట్టి యకార్యము వలదని నేనెంత చెప్పినను వినక యేమో ధర్మములు జెప్పితివి. నిశ్చయముగా నీవు దలంచికొన్నచో కుమారుని దుర్ణయవృత్తిని మాన్పలేకయుందువా? వృద్ధుండవైతివి. ఏమిలాభము. (ఇంచుక యూరకుండి) ఈ పాండవులను దోఁచుకొనిరమ్మని ధృతరాష్ట్రుఁడు నన్నే నియమించినాఁడు.

ఉ. పండుగయంచు దెల్పుదున? ♦ పబ్బమటంచును నే వచింతునా?
కొండిలియంచు బల్కుదున? ♦ వేడుకఁ జూడఁగ రండటందునా?

పాండుకుమారచంద్రులను ♦ భవ్యచరిత్రుల నేవిధంబునన్
దుండగమైన క్రీడకును ♦ ద్రోణ్యకునిపోవుదు తోచదయ్యెడన్.
ఏమైననేమి! రాజకార్యము నిర్వర్తించవలయును గదా. (ఎదుటఁజూచి)
ఇదిగో! ధర్మజుని సభామందిరముననే ప్రవేశించితిని. (ఎదుటఁజూచి)
అదిగో! పాండవులు సభామందిరమునందే యున్నారు. సమీపించెదఁగాక.
(నడచుచున్నాఁడు) (తెర లేచును.)

(ధర్మజ భీమార్జున నకులసహదేవులు ప్రవేశము.)

ధర్మ—(అర్జుననిఁజూచి) తమ్ముఁడా! అర్జునా! నిరంతరమును మన శ్రేయమునుగోరు విదురుఁడు వచ్చుచున్నాఁడు. ఎదురేగి తోడ్కొనిరమ్ము.

అర్జు—(విదురున కెదురుగాఁబోయి) పూజ్యచరితా! విదురా! రమ్ము.

విదు—(ధర్మరాజాదులను సమీపించును.)

ధర్మ—విదురా! నీ రాకచే మేము ధన్యులమైతిమి. అటఁ గూర్చుండుము.

విదు—(ఆసీనుఁడగును.)

ధర్మ—విదురా!

చ. జనకుఁడు పాండుభూవరుఁడు ♦ సద్గతికేగ విచారమంది; నె
మ్మనమున మాయెడన్ గడు న ♦ మంచిత సత్కృపఁబూని మమ్ములన్
బెనిచిన పెద్దతండ్రి; సువి ♦ వేక గుణుండగు వృద్ధుఁడంబికా
తనయుననునే ముదంబెకద ♦ ధన్యచరిత్ర వచింపు మియ్యెడన్.

సీ. భరియింపకద! నర ♦ పాలమణియగుచు
నొప్పుచున్నట్టి సు ♦ యోధనునకు
ఆనందమేకద! ♦ యతని పుత్రుండు సు
లక్షణుండైన యా ♦ లక్ష్మణునకు
అతిసౌఖ్యమేకద ♦ యాత్మజాతునితోడ
సద్గుణుండగు ఘట ♦ సంభవునకు
కుశలమేకద! నయ ♦ కోవిదుఁడును లోక
పూజ్యుఁడు శంతన ♦ పుత్రునకును

తే. గీ. ధార్తరాష్ట్రులకెల్లను ♦ డంబె; తల్లి
యైన గాంధారి మిగుల సౌ ♦ ఖ్యంబుగను నె
నిత్యసంతోషినై నీవు ♦ నెసఁగుచుంటి
వే! వచింపుమిపూ విసువాఁడ ♦ వేడ్కమీఱ.

విదు—ధర్మనందనా! అందఱును సేమంబుగనే యున్నవారు. ధర్మసంధుఁడవైన నీ రాజ్యపరిపాలనము పేర్కొనఁ బొనఁడ బడుచున్నది.

తే. గీ. అనుజయుతముగా నీకు సౌ ♦ ఖ్యంబె; పరమ
సాధ్వియైన పాంచాలి కు ♦ శలమె; తత్కు-
మారులకు భద్రమే; యభి ♦ మన్యునకును
మంగళంబే; వచింపుమా ♦ మాన్యచరిత.

ధర్మ—హరికటాక్షమున మే మందఱమును సుఖులమై యుంటిమి.

భీము—(విదురునిఁ జూచి) నయకోవిదా! విదురా! నీ కటాక్షముచేతనే మేమిట్టి భాగ్యస్థితికి వచ్చితిమి.

విదు—వత్సా! నీకు నాయందున్న యభిమానముచేత నట్లు వచియించెదవు గాని నేను మీ యెడలఁ జేసిన మహాకార్య మేమున్నది?

భీము—మహాత్మా! అట్లుగాదు.

తే. గీ. కౌరవేంద్రకృతమగు లా ♦ క్షాగృహంబు
నందు బడి మ్రగ్గకుండ మా ♦ యందుఁగరుణ
బూని నాడు రక్షింపవే ♦ పూజ్యచరిత
గాక యుండిన నీస్థితిఁ ♦ గాంచగలమె.

ధర్మ—తమ్ముఁడా! భీమసేనా! విదురుండెప్పుడును మన యభివృద్ధినే గోరుచుండును గదా! (ఇంచుక యూరకుండి) విదురా! నీవు వచ్చిన కార్యమేదియో వచింపఁ గోరెదను.

విదు—పాండునందనులారా! సుయోధనుని కోరికపై ధృతరాష్ట్రుండు మిమ్ముల నొకసారి దోడ్కొనిరమ్మని పంపగా వచ్చితిని. ఇదియే నారాకకుఁ గారణము.

భీము—(తనలో) ఇదియేమి! ధృతరాష్ట్రుఁడు స్వతంత్రించి మమ్ముల రావించిన రావించుఁగాక; కాని, యెప్పుడును మాయందు మచ్చరమును బూనియుండు దుర్యోధనుఁడేల మమ్ము రావించుటకు వృద్ధనృపాలునిఁ బ్రేరేచెనో కదా!

అర్జు—(తనలో)

ఉ. మొన్న నెరాదె యగ్రజుని ♦ భూరి మఖంబునుజూడవచ్చి తా
కన్నుల కర్వుదీరఁగను ♦ గాంచిచనెగద బాంధవాళితో
యిన్నిదినాలకే మరల ♦ నేటికిఁ బిల్వగఁబంచె; నాతఁడీ
పన్నిక మెందుకోయకట ♦ భావమునందున దోచదయ్యెడిన్.

ఎన్నఁడును లేనిదయు దుర్యోధనునకు మామీఁద నేడేలవచ్చినదో!

నకు—(తనలో) కారణమేమియు వినిపింపకుండ రమ్మనుట తొందులకో కదా! ఇందుల కేదియో గొప్ప కారణముండినఁగాని విదురుఁడురాడు.

సహ—(తనలో)

తే. గీ. ఎడమకన్నును మఱియును ♦ నెడమ భుజము
నదరుచుండెను నేమికి ♦ డోదవునో గద

గాక యుండిన ఘొన్న నే ♦ గాంచియున్న
కౌరవేంద్రుడు మము:బిల్వ ♦ గతమదేమి.

ధర్మ—(విదురునిఁజూచి) ఆర్యా! విదురా! దుర్యోధనానుమతమున మాపెదతండ్రి మమ్ములఁ దోడ్కొనిరమ్మని నినుఁ బంపుటకుఁ గారణ మేమైయుండును.

విదు—(తనలో) ఇప్పుడు నే నేమని నుడువుదును. ఒక విధముగ సత్యమునే వక్కాణించెదఁగాక! (ప్రకాశముగా) ధర్మనందనా! కారణ మేముండును. భూపాలు రక్షక్రీడాప్రియులుగదా! దుర్యోధనుఁడు మయుసభను దిలకించి యరిగిన పిమ్మట నాతఁడుగూడనొక విచిత్రమైనసభనునిర్మింపఁజేసినాఁడు. దానినిమీరు జూడవలయునఁట.

ధర్మ—మహాత్మా! దుర్యోధను డంత ద్యూతకలాకుశలుఁడును, బ్రియుఁడునుగాఁడే!

అర్జు—ఇక్కడికి సుయోధనాభిమతము తెలిసినది.

భీమ—దుర్యోధనునకు జూదమునం దంత ప్రియము లేకపోయినను, శకుని ప్రేరేపణమున నిట్టి కార్యము చేయఁ దలంచియుండును.

ధర్మ—విదురా! జూదమన్న నాకును బరమప్రియ మేకాని సద్యశము గాంక్షించువారు దాని జేరఁబ్రునకుఁ బోవరు. సమస్తధర్మాధర్మసంవేదివగు నీకు నేను జెప్పవలయునా?

తే. గీ. కుక్కుటపు బందెములు మఱి ♦ గొఱ్ఱెపోరు
యశముఁగాంక్షింపనట్టి ధ ♦ రాధిపులకె
యంతెన్నను వెక్కసం ♦ బైన జూద
మునకు సమ్మతించెనె వృద్ధ ♦ భూపుఁ డకట.

తే. గీ. ఇట్టి దుష్కార్యమును సేయ ♦ నెంచియున్న
యుల సుయోధను వారింప ♦ వలెనుగాక
తానె యిట్టిదానిని సేయ ♦ దలచినాఁడె
సమ్మతించెనె పినికి ♦ శాంతనవుఁడు.

విదు—కుమారా! తే. గీ. భీష్ముఁడే కా దల విచిత్ర ♦ వీర్యజునకు
నిద్ది కూడదటంచును ♦ నేను, గురుఁడు
నెంతయో పల్కితిమిగాని ♦ యింతయేని
దీనిఁ గాదను బుద్ధిని ♦ బూనలేదు.

భీమ—ఈయక్షక్రీడావినోదమువలనసుయోధనుఁడందులాభ మేమో తెలియకున్నది.

ధర్మ—ఏదియో యొక నెపము గల్పించి మన కెగ్గొనర్చుటయే యాతని నిజాభిప్రాయము. ఇంతకంటె వేఱేమున్నది?

భీమ—దుష్టబుద్ధియగు నాతఁడు మన విషయమై యెన్నిమాయలఁ బన్నుచున్నను మనము చెక్కుచెదరక సుఖముగనే యుంటిమి.

విదు—సాక్షాద్రమానాథుఁడగు శ్రీకృష్ణభగవానుఁడు మీపక్షముననుండ నేకొఱంతలు గలుగును?

అర్జు—దుర్యోధనున కీ జూదమునం దేలచిత్తము గలిగెనో కదా! అధ్వరంబున కరుదెంచి యాయా కృత్యములం బరితోషముతోడ వర్తించి, యింతలోనె యిట్టిబుద్ధిని బూనెనేల! ఆతఁడు మాయెడలఁ నిట్టి యసూయఁ బూనుటకు యాగమే కారణమై యుండునా?

విదు—అర్జునా! ఇట్టిసంగతులు నాచేత నేల చెప్పింపఁ దలఁచెదవు. సత్యమును నీవే వక్కాణించితివి.

సహ—యాగమే కారణమని నే నింతకుమున్నే గ్రహించితిని.

నకు—ఆ దుర్యోధనుఁడు యాగమహోత్సవము జూచుటకు వచ్చెననుమాటయే గాని, యాతని మొగంబునఁ గళయే లేదు. మయసభాప్రాప్తివలనను, యాగము చేయుటవలనను మనపై నతనికిఁ గలిగిన యసూయ యెక్కుడ నున్నప్పుడు బయలుపఱచక యెట్లో నిజపురమును జేరి యీమాయను బన్నెను.

విదు—వత్సా! నిజము గనిపెట్టితివి.

తే. గీ. కౌరవేంద్రుని విచార ♦ కారణంబు
నరసి; యతనిని మాతులుఁ ♦ డాదరించి
మిమ్ము నొంపంగ జూదపు ♦ మిషను గలుగ
జేసె; వేయేల సద్గుణ ♦ చిత్తులార.

దీనిని వారించుటకు నేనెంతయో ప్రయత్నముఁ జేసితిని. నే నే యన నేల! సుగుణగరిష్ఠులగు భీష్మద్రోణు లీ విషయమున నిప్పటికిని నాంబికేయునితోఁ జెప్పుచునే యుందురు.

భీము—(ధర్మరాజునుజూచి) ఈసమయమున మనమచ్చటికి బోవకయుండుట మంచి దని నాయభిప్రాయము.

ధర్మ—భీమా! బాల్యమునందే మన జనకుండు గతింపఁగా, ధృతరాష్ట్రుండు మనలను బెంచి పెద్దవారిఁగఁజేసి యిట్టిస్థితికిఁ దెచ్చినాఁడు. ఆతఁడు మనకపకారము సేయువాఁడు కాఁడు. (తమ్ములంజూచి) తమ్ములారా!

చ. అనఘుఁడు, సద్గుణాఢ్యుఁడు మన ♦ కందఱకున్ బెదతండ్రియాటచే
జనపతిగాని జూదమని ♦ సంశయమున్ గని యూరకుండఁగాఁ
జన దదిగాక భీష్ముఁడును ♦ సద్గురుఁడౌ ఘటసంభవుండు స
జ్జననుతిపాత్రుఁడున్ మిగుల ♦ శాంతుఁడు నౌ విదురుండు నుండగా
మనకు ఘటిల్లునే కలఁత ♦ మాన్యులు మీ కిటు శంక యేటికిన్.

ఇంక మనమరిగి ప్రయాణసన్నాహ మొనరించుకొందము. రండు. (విదురుని జూచి) విదురా! రమ్ము. (అందఱు నిష్క్రమింతురు)

---

# ద్రౌపదీవస్త్రాపహరణము.

## పంచమాంకము.

రంగము:—(హస్తినాపురము, సభామందిరము:—ధృతరాష్ట్రుఁడు భీష్మద్రోణులతోఁ బ్రవేశించును.)

భీష్ము—కుమారా! విచిత్రవీర్యాత్మజా! నీవు నా వాక్యము లాలించినను నాలింపకున్నను ధర్మోపదేశము సేయుట నాకు విధియైయున్నది.

తే. గీ. వాద మెవ్వారికైన న♦సూయబుట్ట
జేయు; దానిచే యశమున ♦ శించు; వంశ
వృద్ధికిని భంగమొనగించు ♦ పృథ్వీపతులు
దాని తెరవునఁ బోరాదు ♦ తథ్యమిదియ.

వినోదార్థ మీ ద్యూతక్రీడ యేర్పడినదని చెప్పితివేని మన దుర్యోధనుని బుద్ధి నీకుఁ దెలిసియేయున్నది. పాండవుల కెట్లైన హానిఁగూర్చుటకే యిట్టిది తలపెట్టెను. ఈ విషయమున నేవిధమైన హాని యొదవినను నానింద నీకును నాకును గూడవచ్చును. ఈ కార్యమునకు నేను నిష్ఫలమొదవు పలుకుల పలికితినని తలంపక సుయోధనుని నీ యుద్యమమునుండి వారింపుము.

ద్రోణు—ఆంబికేయా! నీవు ధర్మాధర్మ విచారణదక్షుఁడవు. నీ కొరులు ధర్మముల నుపదేశింప నవసరములేదు. ఇప్పుడు నీ కుమారుఁడు సేయఁదలంచిన కార్యము సజ్జనసమ్మతమైనది కాదు. దీనివలన నొక్కొక్క సమయమందుఁ బ్రాణహానిగూడ సంభవించును.

తే. గీ. పుష్కరుండును నలుఁడును ♦ బుడమియందు
నన్నతమ్ముల బిడ్డలే ♦ యగుదురు గద
జూదమునఁగాదె రిపులైరి ♦ శోభదక్క
గాన వారింపు కొమరుని ♦ ధూర్తతలేదు.

ఇరుదెగలవారియందు బెట్టి యుపాయము సంభవించినను వృద్ధనృపుడు సమ్మతించి యూరకుండెనను నింద నీతలపైఁ బడును. అదియునుగాక.

ఉ. పెద్దలు ద్రోణ భీష్ములు, వి♦వేక గుణాఢ్యులు గల్గియుండియున్
వద్దనలేదె దీనికెటు ♦ వారలు సైచిరటంచు మమ్ములన్

దద్దయు లోకులాడుదురు ♦ తప్పక నిందయు వచ్చుమాకు; నా
సుద్దిని నాలకించి యిక ♦ సూనునిబుద్ధి మరల్పుమీ వెసన్.

ధృత—(తనలో) ఇప్పుడు నేనేమి సేయుదును?

చ. వలదని చెప్పినన్ వినక ♦ ప్రాణములన్ దృజియింపఁజూచునా
కొడుకు; సహాయ మిప్పు డొన ♦ గూడునటంచును పేరు చెప్ప నీ
పలుకుల దోసిపుచ్చినను ♦ భావములన్ గినుకన్ వహింతురే
సలిపెడిదేమి యేమిగతి ♦ సంభవమౌనొకొ తోచదయ్యెడిన్.

(ప్రకాశముగా) ఆచార్యా!

సీ. సకలధర్మాధర్మ ♦ వేదియు వృద్ధుండు
నౌ భీష్ముఁ డియ్యెడ ♦ నలరియుండ
నుభయపక్షక్షేమ ♦ మూహించు మహనీయ
కరుణాకరుఁడ వీవు ♦ గలిగియుండ
సకలధర్మంబులఁ ♦ బ్రకటితంబుగఁ బల్కు
సదమల చరితుండు ♦ విదురుఁడుండ
నీతి కోవిదుఁడును ♦ నిఖిలార్థ విదుఁడును
శాంతుఁడునౌ కృపా ♦ చార్యుఁడుండ

తే. గీ. కలహ మీమాడ్కి గలుగును ♦ లలితచరిత
ఘన వినోదార్థమేర్పడి ♦ గ్రీలునట్టి
యీ దురోదరంబునకు మీ ♦ రేలభయము
నొందెదరు; శంకమానుఁడు ♦ డెందములను.

[అంత విదురుఁడును పాండవులు దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణ వికర్ణులును బ్రవేశింతురు.]

ధర్మ—(తమ్ములనుజూచి) తమ్ములారా! మన పెద్దతండ్రియగు ధృతరాష్ట్ర మహీపాలుఁడు భీష్మద్రోణ పరివేష్టితుఁడై యున్నాఁడు. సందర్శింతము రండు.

విదు—(ధృతరాష్ట్రునిఁజూచి) మహీపాలా! పాండవు లరుదెంచినారు.

ధర్మ—(ధృతరాష్ట్రుని సమీపించి) తండ్రీ! భవదాజ్ఞావిధేయుఁడగు ధర్మనందనుఁడు తమ్ములతో నమస్కరించుచున్నాఁడు. (భీష్మద్రోణులకుఁగూడ నమస్కరించును)

ధృత—వత్సా! ధర్మతనూభవా! ఇటగూర్చుండుము. (తక్కినవారితో) కుమారులారా! ఇట నాసీనులగుఁడు.

(పాండవు లాసీను లగుదురు)

ధృత—వత్సా! ధర్మనందనా! ఇంద్రప్రస్థపుర రాజ్యలక్ష్మిని సుఖముగ నేలుచుంటివి గదా!

ధర్మ—తండ్రీ! నీచే బ్రసాదింపఁబడిన యీరాజ్యము భవదాశీర్వచనాప్రభావమున వర్ధిల్లుచున్నది.

ధృతి—కుమారా! ధర్మసంధుండవైన నీవు మహావైభవముతో రాజసూయమొనర్చి భరతకులమునకెల్ల మిగుల కీర్తిఁదెచ్చితివి.

ద్రోణు—చ॥ భరతకులంబునం బొడమి ♦ పావనతేజులు తమ్ములెల్లరున్
జరతరభక్తిఁ గొల్వఁగను ♦ శ్రేయములందుచు ధర్మపద్ధతిన్
ధరణితలంబు నేలుచు బు ♦ ధప్రకరంబు నుతింపఁగా మహా
ధ్వరమొనరించి కీర్తిలతఁ ♦ బ్రాకఁగఁ జేసితి వెల్లదిక్కులన్.

భీష్మ—ధర్మనందనా!

సీ. హృద్యమై సుజన సం ♦ వేద్యమై రిపుజనా
భేద్యమై పరిపూర్ణ ♦ విభవమగుచు
క్షేమమై శ్రీరమా ♦ ధామమై సజ్జన
స్తోమమై నిరత ని ♦ ర్దోషమగుచు
శూరమై శ్రితజనా ♦ ధారమై సత్కో
దారమై సతతగం ♦ భీరమగుచు
సారమై రిపురాజ ♦ ఘోరమై యురుసుఖా
ధారమై ధర్మవి ♦ స్తారమగుచు

తే. గీ. ననవరత సస్యవృద్ధిచే ♦ నలరుచుండి
కొఱతయనుమాట లేకుండ ♦ గుతలమందు
భవ్యభవదీయపాలన ♦ వాసికెక్కి
చుండుటకు ముదంబును బొందు ♦ చుంటి నేను.

ధర్మ—పితామహా! ఇది యంతయు మీయమూల్యకరుణయే.

భీష్మ—కుమారా! నీధర్మసంధతయే నిన్ను గాపాడుచున్నది.

ద్రోణు—(అర్జునునిజూచి)

తే. గీ. అస్త్రవిద్యలు నాయొద్ద ♦ నభ్యసించి
యఖిలదిక్కులరాజుల ♦ ననిజయించి
విమలకీర్తిని నార్జించి ♦ వెలసితీవు
నాగురుత్వంబు సఫలతన్ ♦ గాంచెఁబార్థ.

నీవు నాకు శిష్యుండవై వెలసినందులకు నే నెంతయు గర్వించుచున్నాను.

దుర్యో—(ధర్మరాజునుజూచి) ధర్మనందనా! నీరాక నాకెంతయు సంతోషదాయకము. అనర్ఘమణిశోభచే వెలుఁగొందు నీసభావిచిత్రముల నరయుదమువు రాక! రమ్ము.

ధర్మ—దుర్యోధనా! ఇంతకంటె సంతోషమేమున్నది.

(ఆసనమునుండి లేచి యీవలకువచ్చును.)

దుర్యో—యుధిష్ఠిరా! ఈ సభాభవనము నూతనముగా శిల్పాచార్యులచే నిర్మింపఁ జేసితిని. దీనిం దిలకించుటకె నిన్ను రావించితిని. కనకరచితస్తంభసహస్రములు గలిగిన యీ ద్వారప్రదేశము జూడుము.

ధర్మ—ఈసభా నిర్మాత నెంతయు మెచ్చవచ్చును. తన యపూర్వరచనా సామర్థ్యమంతయు నిందు వెల్లడిఁజేసినాఁడు.

దుర్యో—ఎట్లయినను మయునిచే నిర్మితమైన మీసభవలె నుండదుకదా!

ధర్మ—అట్లుగాదు. ఒక్కొక్కస్థలమునం దీ సభానిర్మాణ మామయుని మించియు యున్నది.

దుర్యో—నన్ను సంతృప్తిఁ బొందించుటకట్లు పలికెదవుగాని నిజముగా విచారించి నచో నిది మయుసభలో నెన్నవవంతు!

ధర్మ—అట్లనరాదు. ఒకనిని మించిన నేర్పరి యింకొకఁ డుండును గదా!

దుర్యో—ధర్మనందనా! ఈ యపూర్వమణిసభామంటపమున మన మొక్కింతకాలము సుహృద్ద్యూతమున వర్తించుటకు నాకుఁ గోరిక జనించినది.

మ. అనఘా! నీకును జూదమున్నను ప్రియం ♦ బైయుండునం చెప్పుడో విని యున్నాఁడనుగాని మోదమునుదె ♦ వీక్షింపగా లేదు కా వున నీదివ్యసభాప్రదేశమున సం ♦ పూర్ణప్రమోదమ్ము తో డను జూదంబునకై గడంగుదము వే ♦ డ్కన్ పొంద పిల్లినున్.

ధర్మ—(ధృతరాష్ట్రుని సమీపించి) తండ్రి!

చ. జనకుడ వౌటచేత ననుఁ ♦ జయ్యన రమ్మని యివ్విధంబుగా నను జులగూడి ద్యూతమున ♦ కై చనుదెంచితి; నిట్టి దానికిఁ మనముల నించుకేని యను ♦ మానము బూనక సమ్మతించిరే యనిమిషవాహినీసుతుఁడు ♦ సద్గురుఁడున్ మఱి నీవు జెప్పుమీ.

దుర్యో—(ధర్మరాజుంజూచి) ధర్మపుత్రా! నీవక్షవిద్యారతుండవగుటం జేసి నిన్ను రావించితిని. దీనికై యొకరితో నీవు యోజింప నవసరము లేదు. ఇయ్యది వినోదార్థమై యేర్పడినదిగాని మఱియొకవిధముగాఁ బరిణమించునని తలంపకుము.

విదు—దుర్యోధనా! వినోదార్థమైనను, యథార్థమైనను, వృద్ధుల యభిప్రాయమును బొంది వర్తించుట మంచిదికదా! ఇదియునుంగాక, నీతికోవిదులైన నరపాలురు విశేషించి ద్యూతము, వేట, పానము, కాంత, మొదలగు వ్యసనంబులందు తగుల్కొనరు.

కర్ణ—విదురా! ఇందు నీ సంబంధ మేమున్నదని ధర్మశాస్త్రము జెప్పుచుంటివి. విశేషించి తగుల్కొనకూడునను యేసూత్రమైన తగులుచున్నదా?

భీష్మ—కర్ణా! ధర్మశాస్త్ర ప్రశంస నీకెందుకు? ఎవ్వరైన విన్న నవ్వెదరు?

దుర్యో—(కర్ణునిఁజూచి) మిత్రమా? ఆసంగతియంతయు మనకేల? వినోదార్థము గావున యుధిష్ఠిరుని జూదమాడుటకై యడిగితిని. (ధర్మరాజుంజూచి) ధర్మ తనయా? నాప్రశ్నకుత్తరమీయలేదు.

ధర్మ—సుయోధనా? ధర్మనిత్యులైనరాజులు జూదమును వర్జింపవలయును. మఱి యును కుత్సితకితవులతోఁ జూదమాడరాదు. దానంజేసి యెట్టివారైనను సర్వధర్మవివర్జితులగుదురు. మాయాద్యూతమున జయించుట పాతకమనియు, ధర్మద్యూతమున జయించుట పుణ్యంబనియుఁ పెద్దలు చెప్పెదరు. నీవునాకు గడుఁ గూర్చువాఁడవగుటంజేసి చెప్పుచుంటిని. ఈద్యూతమువలన నెన్నియో యనర్థకములు కలుగును. మనవంటివారు దానిపేరైన నెత్తరాదు. నా మాటవిని యట్టికోరిక విడుమ్ము.

అర్జు—(తనలో) అగ్రజుఁడు బాగుగనే ప్రత్యుత్తరమిచ్చినాఁడు. కాని యియ్యది నిలిచి యుండవలెనుగదా!

శకు—(ధర్మరాజునుఁజూచి) ధర్మరాజా! నీవుచెప్పినవాక్యములు సహజసముగ లేవు. లోకజ్ఞుఁడును, మహామతియు నగుక్షత్రియుఁ డెందును దానిని నిందింపఁడు. ఇదియుంగాక బలహీనులయిన వారలు బలవంతులను జయింపఁదలంచి నప్పుడు బహువిధ మాయోపాయముల జయింపవచ్చునుగదా! అదిమాత్రము జయముగదా! ఎట్లయినను జయమేకదా ప్రధానము.

దుర్యో—ధర్మనందనా! నీవు యక్షవిద్యావిశారదుండ వగుటంజేసి యడిగితిని. దాని నీవెంతయో ధర్మశాస్త్రపన్యాసము సేయఁబ్రారంభించితివి. పోనిమ్ము. నీ వాఁడలేనివాఁడవేని యోడితివనుము.

శకు—రారాజా! మంచిమాటజెప్పితివి.

అర్జు—(తనలో) పిర్రగజునకు రోషము గలిగించుచున్నారు.

ధర్మ—(ఆవేశముతో దనలో)

ఉ॥ వేదమునాడ నమ్మనుచు ♦ నొంపుగఁబల్కును బోదియిట్లు, స
మ్మోదముతోడవచ్చి నృప ♦ పుంగవులెల్లరికిన్ బ్రియంబు సొం
పాదమునందు మేఁకయని ♦ సోదరుల సన్నుతిఁగాంచు నాకు మ
ర్యాదయె! వెన్కదీయఁగను ♦ రాజులునవ్వరె, భయటంచునన్.
దుర్యోధనా—

శా॥ చాలుం జాలును నీదుమాటలనికన్ ♦ జాలింపుమీ యెల్ల భూ
పాలగ్రామణులందు బోవ్వడియు బి ♦ ల్వన్ నీవు వెస్టియగా
నేలా! నేనవివేకినౌదునె జగం ♦ బెరీతి నన్మెచ్చు; నీ
పాలోకింతువటంచు ధర్మము సము ♦ ద్వృత్తేమ వాక్రుచ్చితిన్.

తే. గీ. వలదు వలదంచునేఁ బల్క ♦ పలుకువినక
పలుకుమనెదేల యోడిన ♦ వాఁడననుచు
నంతకోరిక నీకును ♦ నమరియున్న
నమ్మ జూదమ్మ నాడరా ♦ నమ్మ రమ్ము.

అర్జు——(తనలో) ఏమిది! అన్నగారి వాక్యమునం దమంగళమున్ఫురించుచున్నది. ఆహా! రోషమెంతటి కార్యమునైనను జేయించును. ఈ పలుత ... దమాడుట తగదని పలికిన యీతఁ డిప్పుడు సమ్మతించెను. ఈ ధార్తరాష్ట్రాగ్రజుఁ డేమి మాయబన్నునో! మా యగ్రజుఁ డక్షవిద్యావిశారదుఁడే గాని యొకరిమాయ నొకరు కనుఁగొనుట కష్టముకదా!

శకు——(తనలో)

ఉ॥ నాదగునేర్పుఁజూపి యమ ♦ నందను సంపదలన్ హరించి, స
మ్మోదముఁబొంద నెంతొ కురు ♦ భూపునకుం గడుఁగూర్చి యెల్లభూ
మీధవులన్ నిరంతరము ♦ మేకురభక్తిని గొల్వఁజేసి; యా
మోదము నంగరాడ గురు ♦ ముఖ్యుఁడు మన్నన గన్నుఁ జయంగనే.

(ప్రకాశముగా ధర్మరాజుంజూచి) ధర్మనందనా! జూదముకన్నఁ బరమామోదము గూర్చువిద్యయు, ధనసంపాదకమైన విద్యయు లేదని నీవెఱుంగుదువుకదా! కావున సంతోషాంతరంగుండవై యొక్కింతకాల మిందు వర్తింపుము. వినోదార్థ మగుటచేఁ గలహ మావంతయు ఘటిల్లదు.

ధర్మ——గాంధారభూపా! ద్యూతకలాకుశలుండవగు నీవు మధ్యస్థుడవై యుండఁగోరెదను.

దుర్యో——వృద్ధులగు భీష్మద్రోణులుండఁగా శకుని మధ్యస్థుఁడై యుండనేల! (ఇంచుక యూరకుండి) ధర్మనందనా! ద్యూతమున నీకును నాకును హస్తిపురికాంతరము. అందుచేత నాకుఁగాను శకుని నీతో జూదమాడును.

ధర్మ——[తనలో] మాయాద్యూతమున శకునికున్న ప్రావీణ్యము మఱియొకరికి లేదు. ఈతఁడు నన్నేమి వంచించునో యని డెందమున సందియము గలుగుచున్నది. అయిన నిట్లు జెప్పెదఁగాక! (ప్రకాశముగా) ధార్తరాష్ట్రాగ్రజా! జూదమాడఁగా నొకసమయమున యశంబును ధనమునుగూడ దెచ్చును. మఱి యొకసమయమున రెండును బోగొట్టును; ఆకారణమున నికార్యము దనకు దానే చేయవలయునుగాని, యొకరికై మఱియొకరాడుట యుచితముగాదు.

ద్రోణు——(తనలో) ధర్మమూర్తియగు ధర్మతనయుఁడుగూడ, నావేశముచే ద్యూతమునకు సమ్మతించుచున్నాడు. ఈదుర్వ్యసనమున జిక్కికొన్న యీతనిని వీరేమివంచింతురోకదా! జూదము పుణ్యప్రదమని ధర్మశాస్త్రములేల చాటుచున్నవో కదా!

దుర్యో—(ధర్మరాజునుజూచి) అన్నా! నాకుఁ బ్రతినిధిగా మామా[redacted] శకుని జూదమాడునని నీవు సంశయింపఁ బనిలేదు.

తే. గీ. ద్యూతమందు నాకైయాత ♦ డోడునట్టి
భాగ్యరాసుల నేనె యు ♦ ర్వణముసేతు
నీకు నమ్ముమీ నామాట ♦ నిక్కముగను
నాడఁ గల్గినవాడవే ♦ నాకుమయ్య.

శకు—ధర్మరాజా! ఆడఁదలంచినవాని కీయనవసర ప్రసంగ మేల? దుర్యోధనుఁడు గాక పోయినచో నేను మాత్రము ధనరాసు లొడ్డలేనా! నేను రాజును గానను కొంటివా? నాకు రాజ్యము లేదనుకొంటివా?

భీష్మ—(తనలో) దుర్మార్గుఁడగు నీశకుని ధర్మపుత్రుకున కెట్లు రోషము గలిగించు చున్నాఁడు.

కర్ణ—(ధర్మరాజును జూచి) ధర్మసంభవా! దుర్యోధనుఁడు జూదమాడుటకు శకునినిఁ బ్రతినిధిగా నేర్పఱచి కొనినాఁడు. ఈతఁ డొడ్డు ధనరాసులన్నియు దుర్యోధనుఁడే భరించును. నీ విందులకు సంశయించితివేని శకునియే భరించును. ఈతఁడు మాత్రము సామాన్యుఁడా! ఒకవేళ నీత డేకారణముచేతనైనను దానికి సమ్మతింపకేని,

తే. గీ. అంగరాజ్య మిచ్చెద సంశ ♦ యంబులేక
నీకు; నింకను ఋణమున్న ♦ నిశ్చయముగ
నఖిల దిక్కుల రాజుల ♦ నాజిగెల్చి
నితనికై నేనె యిచ్చెద ♦ క్షితితలేంద్ర.

విదు—(కర్ణునిఁజూచి) రాధేయా! దిగ్విజయం బొనర్చిన ధర్మనందనుని తమ్ములిచ్చట నున్నారు. అట్టి పలుకులఁ బలుకకుము. దుర్యోధనుని కన్నను, గాంధారరాజు కన్నను, నెక్కువ వాఁడననియా! నీతో జూదమాడుటకు ధర్మనందనుఁ డంగీకరించును. ఒకవేళ నీవు రాజులంగెల్చి ధనముదెచ్చి ధర్మపుత్రున కీయఁగల సామర్థ్యమున్నను మనవంటి సూతకుల సంభవు లొసంగు దానమును సుక్షత్రియవంశప్రసిద్ధుఁడగు ధర్మనందనుఁ డెట్లు గ్రహించును?

భీష్మ—కర్ణా! సకలరాజులను జయించెదనని నలువురు మెచ్చని వాక్యములేల పలికెదవు? నీ సామర్థ్యమంతయు ద్రౌపదీస్వయంవరమునాఁడె వెల్లడి యైనది.

కర్ణ—(కోపముతో) ఏమీ! (ఏమో యనఁబోవును?)

దుర్యో—(కర్ణునివారించి విదురుని విలోకించి) విదురా! ప్రతివిషయము నందును నీవేల జోక్యము గలిగించుకొందువు? నేను మాతండ్రినిఁజూచి నిన్ను సైరింప వలసి వచ్చుచున్నది.

ధృత—(దుర్యోధనునితో) కుమారా! ఏమది? విదురునిపై నీసును జూపుచున్నావు. నీ వాక్ప్రాబల్య మాపుము. (విదురుని విలోకించి) విదురా! బాల్య చాపల్యమున సుయోధనుఁడాడు వాక్యముల సరకుఁగొనక శాంతింపుము.

విదు—శాంతింపక చేయునదేమున్నది? (రహస్యముగా) మహీపాలా! నేను నిరంతరము మీ క్షేమమే కోరుచుందును. అందుచే లోకహితమును, నీహితమునుఁ గోరి వచించు నామాట వినుము. పిదప నీయిష్టమెట్లో యట్లు సేయుము.

చ. తనయుఁడటంచు వీనిని ము ♦ దంబున జూడఁగబోకుమీ మదిన్;
జనసుతిఁగన్న వంశమును ♦ నాశనముం బొనరింప నెంచియే
జననముగాంచె వీడిఁక ను ♦ స్వాంతమునన్ దయవీడి వీనినిన్
హననము జేసి సద్యశము ♦ నందుము వంశము నిల్పఁగా మహిన్.

వీడు గతించినను దక్కిన పుత్రులుండిరిగదా. నీవట్లు సేయవైతివేని, దురాత్ముఁడగు నీ దుర్యోధనుని మూలమునఁ గుమారులెల్లరును, సకల బంధువులును గూలుదురు.

ఉ. కావున సంశయింపక, జ ♦ గంబునకున్ హితముం బొనర్ప, నీ
భావమునందుఁ బ్రేమ నెడఁ ♦ బాసి; జనంబులు మెచ్చునట్లు దు
ర్భావుని వీనినిం దునిమి ♦ భారత వంశము నుద్ధరింపుమా
నీవు; యశంబు చేకుఱును ♦ నిక్కము నాఁ గురువంశ భూషణా.

కర్ణ—(దుర్యోధనునితో) సుయోధనా! కంటివా! విదురుఁడు మీతండ్రికేదో బోధించుచున్నాఁడు.

దుర్యో—ఏమున్నది? మన కార్యమున కంతరాయము గలిగించుటకే. ఇంతకును రాజుల యుచ్ఛిష్టము దిని జీవించు దాసీపుత్రుఁడగు వీనినిఁ బ్రాణసఖునిగా జేర్చిన మాతండ్రి ననవలయును. కానిమ్ము. మన మిప్పుడెవ్వరితోడను గలహింపరాదు. ప్రస్తుతకార్యము దెస వర్తింతము. (ధర్మరాజునుజూచి) ధర్మనందనా! మా మామయగు శకుని నీతోఁ జూదమాడుట కంగీకరించితివా, లేదా? లేదేని యాతని కోడితివని తలంచెదము.

ధర్మ—తమ్ముఁడా! నేను ధర్మము నక్కాణించితినిగాని శకునితో నాడుటకు భయముంది కాదు.

తే. గీ. శకునికి దురోదరంబున ♦ శక్తియెంత
యున్న; నాకందొకింత లే ♦ కున్నఁగాని
యాహుతుడ నౌచువచ్చి భ ♦ యంబునంది
మరలిపోవుదునే నేను ♦ మానవేంద్ర.

ఇదిగో! నేను సంసిద్ధుఁడనై యున్నాను.

భీష్మ—(తనలో) ఎట్టి ధర్మశాలికైనను నీ దురోదరము రోషము గలిగించుచుండు. సుర సేవించినవారును, కాంతాలోలురును కొంతసేపటికి తమశరీరమును దాము గుర్తించుకొనఁ గలుగుదురుగాని, ద్యూతప్రియులకు మర్యాదను వదలు నాడలు తెలియదుకదా!

దుర్యో—(ధర్మరాజునుఁజూచి) యుధిష్ఠిరా! అటుచూడుము. చందన కర్పూర కస్తూరి పరిలిప్తంబయిన ద్యూతరంగము. మనమందుఁ బ్రవేశింతుము. రమ్ము.

ధర్మ—ఇదిగో! వచ్చుచున్నాను.

(దుర్యోధన శకుని ధర్మజ దుస్ససేన కర్ణ లించుక నడిచి కూర్చుందురు.)

ధర్మ—దుర్యోధనా! ఇంకఁ గార్యమున కుపక్రమింపవచ్చునా? శకునికై ధనరాసులు నీవే యిచ్చెదవుకదా!

దుర్యో—ఆసంగతి యిదివఱకే చెప్పితినిగదా.

శకు—ఇవిగో! పాచికలు. నీవే ప్రారంభింపుము.

ధర్మ—(పాచికలు పుచ్చుకొని) పందెము వేయుము.

దుర్యో—ఇదిగో! రత్నఖచితములగు ప్రశస్తవస్తుసందాయము బందెముగాఁ బెట్టితిని.

ధర్మ—(పాచికలు వైచును.)

దుశ్శా—మామా! మామా! గెలుపుమనదే.

ధర్మ—తొందరపడకుము. గెలుపు నాయది. చూడుఁడు.

శకు—సత్యమే. నానితో నేమి? (దుశ్శాసనునితో రహస్యముగా) దుశ్శాసనా! ముందుగెలు పాతనికే వచ్చునట్లు జేయవలయును. దానితో నాతఁడుత్సాహపరిపూరితుండగును. (ధర్మరాజుతో) ఇంక నీవాడుము.

ధర్మ—ఇదిగో! సాగరావర్తసంభవములైె మదీయ భాండారముననున్న మణిసముదాయము బందెముగాఁ బెట్టితిని.

శకు—(పాచికలువేసి) పందెము నాది. తిన్నఁగజూడుము. అనృతమాడితినందువు. మరల నొడ్డుము.

ధర్మ—రత్నభాండారములును, సువర్ణభాండారములును నొడ్డితిని.

శకు—(పాచికలువేసి) ఈసారియుఁ బందెమునాదియే.

ధర్మ—(తనలో) ఏమిది! మాయగనున్నది! ద్యూతమున నెన్నఁడును నోటమియను రెఱుంగని నాకు నేడిట్లు గలుగుచున్నది.

శకు—ధర్మనందనా! సంశయించుచుంటివేల! ఇంక బందెము వేయువా యేమి?

ధర్మ—గాంధార రాజా! అట్లు బలికెద వేమి? ఇదిగో మత్తగజసందోహమును, నర్జునునకుఁ జిత్రరథుఁడిచ్చిన యేనూరు గంధర్వ హయంబులును, రథప్రకరమును నొడ్డితిని.

శకు—(పాచికలువేసి) ఏమిది! ఆశ్చర్యముగ నున్నది. ఒక్క పందెమయినను నీకు లభించుటలేదే.

ధర్మ—(తనలో) అక్కటా! ఏమిది! పందెములెల్ల శకునియే గెలుచుచున్నాఁడు.

శకు—ఆలోచనయేల! పందెమొడ్డి పాచికలు వేయుము.

ధర్మ—(రోషముతో) దేవబ్రాహ్మణక్షేత్రములుదప్ప తక్కిన నారాజ్యమంతయు నొడ్డితిని.

శకు—కానిమ్ము. ఈ సారియైన నీవు గెలువకయుందువా? (పాచికలువేసి) ధర్మనందనా! చూచితివా? ఏమైనదో!

ధర్మ—(తనలో) అక్కటా! భగవంతుఁడు నన్ను వంచింపఁ దలంచినాఁడు. కాకున్నచో నిట్లన్నదైన సంభవించెనా! (విచారించును.)

అర్జు—(తనలో) రోషావేశమున నగ్రజుఁడీమాయజూదమున సమస్తరాజ్యశ్రీలును నోడినాఁడు.

భీము—(తనలో) అక్కటా! కాలమెట్లు మారినది.

నకు—(తనలో) ఇట్లగునని నేను మున్నే తలంచితిని.

సహ—(తనలో) దురాత్ముండగు సుయోధనుఁ డిట్టిమాయఁ బన్నెను.

ద్రోణు—(భీష్మునితో జనాంతికముగా) భీష్మాచార్యా! ఏమి! ఈదురంతము! పెద్దలమగు మనముండినను నిట్లు జరుగుచున్నది!

భీష్మ—ఆచార్యా! కురుకులమునకు వినాశకాలము సమీపించుచున్నది. మనమేమన్నను బ్రయోజనములేదు.

ధృత—(విదురునితో) విదురా! ఏమి ఈకలకలము.

విదు—ద్యూతమునకు మూలకారకుఁడవైన నీవేమియు నెఱుఁగనట్లు మాటలాడుచుంటివే. మాయజూదమున నీసుతుఁడగు దుర్యోధనుఁడు పాండవుల రాజ్యశ్రీలగెల్చినాఁడు. ఈతఁడు దుష్టబుద్ధితో నుద్భవించినాఁడు. తొల్లి యెన్నఁడును గళంకమెఱుఁగని భరతకులము వీనిమూలమున నాశనముగానున్నది. ఒక్కనిమూలమున గులమునకు హాని సంభవించునేని వానింగూల్చి కులము రక్షింపవలెనని మున్ను శుక్రుఁడు వచించియున్నాఁడు. ఈ కారణముచేతనే కదా మున్ను కులదూషకుండైన కంసుని మేనమామయనక శ్రీకృష్ణుఁడు వధించెను. దుర్మార్గుడగు దుర్యోధనుఁడు పోయిననేమి? నీవు సహించి యూరకుంటివేని కులనాశనమగును.

మ. కడుదుర్మార్గుఁడు వీనినింగొడపి మీ ♦ కౌరవ్యవంశంబు నె
క్కుడు కీర్తిన్విలసిల్లఁజేసి యిఁకఁ లో ♦ కుల్ మెచ్చఁగా పాండుపు
త్రుల సద్ధర్మచరిత్రులన్ గనుము సం ♦ తోషంబు దీపింపగా
బడయంగల్గెద వీవు సౌఖ్యముల భూ ♦ పా! నమ్ము నావాక్యముల్

ధృత—(తనలో) ఎంతదారుణ మెంతదారుణము!

కర్ణు—(దుర్యోధనునితో) ఈ విదురుఁడెప్పుడును నీతండ్రితో నేదో యొక నేరము నీపైఁ జెప్పుచునే యుండునుగదా!

దుర్యో—ఆతని కితరకార్యము లేవియును లేవుగదా!

విదు—(తనలో) ధృతరాష్ట్రుఁడు నావాక్యములకుఁ బ్రత్యుత్తరమీయక మిన్నకుండెను. కానిమ్ము. దుర్యోధనుని మందలించిచూచెదగాక (దుర్యోధనునిఁజూచి) దుర్యోధనా! నీ వెట్టి యకార్యము జేసితివి. మాయాద్యూతమున ధర్మచరిత్రులగు పాండవేయుల రాజ్యశ్రీలఁగొన్న నిన్ను జనములు నిందింపకుందురే. వారి యెడల నీవిట్టి యపకృతిఁ గావించుట ధర్మమగునే?

సీ. న్యాయంబు విడనాడి ♦ యలఘుచరిత్రులౌ
పినతండ్రి పుత్రుల ♦ వేడ్కఁ బిలిచి
మాయ జూదమునందు ♦ మనసు గొల్పగజేసి
శ్రీలఁగైకొని పరా ♦ జితులఁజేయ
ధర్మమే నీకిది ♦ ధరణిజనులు నిన్ను
హీనచరిత్రు గా ♦ నెంచకుండ్రె
ధర్మస్వరూపులౌ ♦ ధర్మజాదులతోడ
కలహ మేటికి నీకు ♦ గారవేంద్ర

తే. గీ. మాయజూదం బదేటికి ♦ మానుమయ్య
సజ్జనుల్ పోవు పథమున ♦ జనగదయ్య
పెద్దలు వచించు వాక్యముల్ ♦ వినుచు; వంశ
వృద్ధియగు మార్గమరయుమీ ♦ పృథ్వీపాల.

దుర్యో—(కోపముతో) విదురా! నీ వెప్పుడును బరులగుణములనే పొగడుచుందువు. మమ్మెప్పుడును నిందించుచుందువు. నీవు తిన్నయింట వాసముల నెన్నుచున్నావు. ఉగ్రవిషసర్పము చందమున నీయునికి మాయొద్దఁ జెలంగుచున్నది. పరులసంపదలను నెట్లయిన సుఖోపాయమునఁ గొనుట క్షత్రియ ధర్మమే కదా! నాకు మాత్రము ధర్మాధర్మములు తెలియవా? నీవు నాకు బుద్ధిజెప్ప నవసరము లేదు. మిన్నకుండుము.

విదు—దుర్యోధనా! నీవట్లు పలికితివని నే నాగ్రహించువాడనుగాను. ఇప్పుడు నా వాక్యములు నీకు రుచింపవు. నీతికోవిదు లెప్పుడును నిష్కపటముగఁ జెప్పుదురు. నేను నిరంతరమును నీతండ్రికి నిష్టము గూర్చెడి వాక్యములచేఁ జెప్పితిని. పిదప నీయిష్టము.

శకు—(ధర్మరాజుంజూచి) ధర్మనందనా! సమస్త సంపదలును రాజ్యమును నోడితివి. ఇంక జూదము జాలించెదవా? లేక మఱి యే యుపాయముచేతనైన నాడెదవా?

ధర్మ—(తనలో) ఆహా! కాలమెట్లుగా మాఱినది. (ఆవేశముతో)

మ. ధరగోశృంగ నివాసులంగెలిచి మో ♦ దంబారగా జంభకున్
దురమందుం వధియించి పాండ్యనృపునిం ♦ దోర్గర్వముం బాపి; దు
ర్భరబాహాబలశాలి నీలు నని ద ♦ ర్పంబెల్ల దూలించి: నా
వగయూగంబునకుం ధనంబొసగె నె ♦ వ్వాడట్టి మాద్రీసుతుం
డరయుం బందెముగాగనుండు నిట నా ♦ యాజ్ఞానుబద్ధుండునై.

శకు—రాజా! బాగున్నది. అట్లయిన నిదిగో! పందెము. (పాచికలుచూచి) గెలుపు మాదే. ఇంకేమి యొడ్డెదవు?

ధర్మ—అట్లనా! కానిమ్ము. ఇదిగో మత్తమయూరకులతో గయ్యమొనర్చి మరుమాళవ బర్బరకర్ణ దేశాధీశుల జయించి, సరస్వతీతీరనివాసులను, సింధుకులాశ్రితులను, బంచనదామరపర్వత దివ్యకటనివాసులను; వశగతులం జేసికొని, బర్బరకిరాత వీరుల రణంబున నోడించి మదీయసవనార్థమై యసంఖ్యాకధనవస్తువాహన నివహంబులు గొనివచ్చిన నకులునిం బణముగా బెట్టితిని.

శకు—సవతితల్లికొడుకులనియా! వీరిని బణముగా ముందుబెట్టుచుంటివి.

ధర్మ—గాంధారరాజా! నీ చమత్కార వాక్యములం జాలించి ప్రస్తుతకార్యమును జూడుము.

శకు—(పాచికలు వేసి) నీవే చూడుము.

ధర్మ—(తనలో) అక్కటా! ఏమి! దురదృష్టము. (ప్రకాశముగా) దానికేమి? జయాపజయములు దైవాధీనముగదా ఇదిగో!

సీ॥ సంగరస్థలమున ♦ నంగార పర్ణుని
భంగమొందించిన ♦ బాహుశాలి
త్ర్యాకశతుస్రిలకు న ♦ శముగాని యమ్మత్స్య
యంత్రంబు గొట్టిన ♦ యలఘునీరు
డగ్నిదేవునిచేత ♦ నతిభయంకరమైన
గాండీవమందిన ♦ ఘనగుణుండు
ఖాండవారణ్యంబు ♦ గాల్చుసమయమందు
విబుధేశునోర్చిన ♦ విక్రముండు
తే. గీ. వాసుదేవుని కృపచేత ♦ వరలువాడు
సంతతము మదీయాజ్ఞను ♦ జరుపువాడు

నైన యర్జునుం డిపుడు నా ♦ యాజ్ఞపైన
నిలుచుఁగావుతఁ బణముగా ♦ లలితమతిని.

మఱియు, భగదత్త పౌండ్రక కులూతాధిప విష్వగశ్వ సుధన్వుల రణం
బున నిర్జించిన మహాబలపరాక్రమవంతుఁడగు నయ్యర్జును నొడ్డినాను.

శకు—(పందెమువైచి చూచి) యుధిష్ఠిరా! మేమే గెలిచితిమి.

ధర్మ—సరే—(ఆవేశముతో) ఇదిగో.

సీ. కాశికాపురిని లా ♦ క్షాగృహంబున బడి
మరణింప కుండంగ ♦ మమ్ముఁగాచె
నడుకానలోనున్న ♦ కడు పరాక్రమశాలి
యా హిడింబుని దెగ ♦ టార్చి మించె
అల బకాసురుఁగూల్చి ♦ బలమున నేకచ
క్రాపురవాసుల ♦ కలఁతదీర్చె
బకుపాలు విధమున ♦ శిశుపాలునవినోర్చి
దశదిశలందున ♦ యశముగాంచె

తే. గీ. రాజసూయాధ్వరార్థమై ♦ రాజులెల్ల
సన్నుతింప జరాసంధు ♦ జంపె; నట్టి
బలపరాక్రమశాలియా ♦ వాయుసుతుఁడు
పందెముగ నిల్చుగాక యా ♦ నంద మెసగ.

శకు—(పందెమువైచి) యమనందనా! మేమే గెల్చితిమి.

ధర్మ—కాలవైపరీత్యమున నెవ్వ రేమి సేయుదురు? కానిమ్ము.

చ. తెలివి సమస్తముఁ విడిచి ♦ ధీరులునవ్వగ మాయజూదపుం
గొలువునఁజొచ్చి రాజ్యమును ♦ గోల్పడి యంతటనూరకుండకే
లలితచరిత్రులౌ యనుజు ♦ లఁ బణమొడ్డిన ధర్మసూతియే
నిలచెను బందెమై యిపుడు ♦ నిక్కముగా నెవరెట్లు దూరినన్.

శకు—(పాచికలు వేసి చూచి) ఇదియు మేమే గెల్చితిమి.

ధర్మ—(తనలో) అక్కటా! ఎంతకు వచ్చినది.

శకు—ధర్మరాజా! మీ యేవురకును బ్రియురాలగు పాంచాలి నొడ్డక నీవే పణ
ముగా నిల్చితివేమి! అట్లిపుడైనఁజేసి నీవుగెల్చితివేని యింతకుమున్న నీవో
డినదంతయు నిచ్చివేసెదము.

ధర్మ—(ఆవేశముతో) చెడ్డకాపురమునకు ముప్పేటికి?

తే. గీ. పరమసాధ్వియటంచుఁ దె ♦ ల్పంగ ధరన
యోనిజయగుచు నల ద్రుప ♦ దోర్విపతికి

వరసుపుత్రియై పాండవ ♦ పత్నియగుచు
భాసిలిన ద్రౌపదిని నేను ♦ పణము నిడితి.

శకు—(పందెము వేసిచూచి) రాజా! నీవెంతయు దురదృష్టవంతుఁడవు.

దుర్యో—(విదురునిఁజూచి) విదురా! నీవుపోయి మాకు దాసియైన పాండవపత్ని నిటకుఁ దోడ్కొనిరమ్ము.

భీము—(కోపము సూచించును)

విదు—(కోపముతో దుర్యోధనునిఁ జూచి) కౌరవేశ్వరా! నీ కెట్టితలఁపులు పుట్టుచున్నవి. జూదమున నోటువడినంతనే సాధ్వీమణియగు ద్రౌపది నీకు దాసియయ్యెనా? అవనీతలసమ్రాజ్యోత్సవమునకు యోగ్యమైన పాండవ ధర్మపత్ని నీచే నవమానము నొందఁదగినదా! కొన్నాళ్లు సుఖివై బ్రదుకఁజూచుకొనుము. అటుజూడుము. (భీముని నిర్దేశించి)

చ. జగముల నొక్కపెట్టునను ♦ శౌర్యముతోడను మ్రింగజాలు, నా
యగణిత సత్వుఁడైన పవ ♦ నాత్మజునైనను జూడకుండనే
తెగువనుబూని యీకరణిఁ ♦ దెల్పితి వెంతయుఁ జాలుఁజాలుఁ; నీ
పగ ద్రుపదాత్మజాత నిటు ♦ బల్కెడి పాపము సంభవింపదే.

దుర్యో—(ప్రక్కఁజూచి) ఎవఁడురా! అక్కడ.

ప్రాతి—(ప్రవేశించి) మహారాజా! ఏమి సెలవు?

దుర్యో—నీవు సత్వరముగఁబోయి యిక్కడ జరిగిన దంతయు దెలిపి ద్రౌపదిని దోడ్కొనిరమ్ము.

ప్రాతి—చిత్తము. (నిష్క్రమించును)

ధృత—(విదురుని జూచి) విదురా! ఆకలకలమేమి? జూదమందు వరు లేమి యోడిరి.

విదు—మహీపాలా! నీకుఁ జూచుటకుఁ గన్నులులేవు గాని వినుటకుఁ జెవులులేవా యేమి? దీనికి నీవే మూలము. దుర్ద్యూతమున ధర్మజుఁడు తమ్ములనోడి తాను గూడ నోటువడి ద్రౌపదిని గూడ నోడిపోయెను. నీవీ విషయమునఁ దలయూచుటచే నింతవఱకు వచ్చినది. నిన్ను దైవమెట్లు పాలించునో తెలియదు.

ప్రాతి—(ప్రవేశించి) మహారాజా! నీయాజ్ఞననుసరించి ద్రౌపదికడ కేగితిని. ఆమె నన్నుఁగాంచి యేయుగమునందును జూదమున భార్యను నోడినవాడు లేడే. అయినను మున్ను నన్నోడి తన్నోటువడెనో, లేక తా నోటుపడి నన్నోడెనో యెఱింగిరమ్మని పలికెను.

దుర్యో—సరే. (దుశ్శాసనునిఁజూచి) తమ్ముఁడా! నీవరిగి యీధర్మసందేహ మిక్కడ తీరునని చెప్పి యామెను దోడ్కొనిరమ్ము.

శకు—(జనాంతికముగా) అబ్బాయీ! దుర్యోధనా? ఇప్పుడు నీ చిత్తమునకు సంతోషము కలిగినదికదా!

దుర్యో—మామా! నీదయయుండ నా కేమికొదువ?

(తెరలో)

మ. వనితారత్నమ! రమ్ము రమ్మికను నీ ♦ భావంబులో నింతయే
ననుమానంబును బొందగావలదు నీ ♦ యాత్మేశుఁడౌ ధర్మనం
దనుఁడే యోడెను నిన్ను ద్యూతమున మా ♦ దాసత్వమున్ బాండునం
దనులున్ జేసిరి, దాసివైతివిక దా ♦ తథ్యంబుగా నీవునూ.

(తెరలో)

దుశ్శాసనా! నేను సాధ్విని. ఏకవస్త్రను. రజస్వలను. నన్నుఁటకుము.

దుర్యో—(కర్ణునిఁజూచి) రాధేయా! ఆ ద్రౌపది వాక్యముల వింటివా? (ఎదుటఁ జూచి) అదుగో! తమ్ముఁడు ద్రౌపదిని దోడ్కొని వచ్చుచున్నాడు.

దుశ్శా—(ద్రౌపది శిరోజములఁ బట్టుకొని యీడ్చుచుఁ బ్రవేశించి) నీవు సాధ్వివా?

తే. గీ. ఏవురు పతులతో నొప్పు ♦ యింతివీవు
సాధ్వినంచును బల్కెదే ♦ చపలనేత్రి
ధర్మజుఁడు నిన్నునోడుటఁ ♦ దాసివైతి
మాకు, రమ్ము వేగమ్మె ప ♦ ల్మాటలేల.

ఏకవస్త్ర వేగాని విగతవస్త్రవు కావుగద. రమ్ము.

దుర్యో—(కర్ణునితో) తమ్ముఁడు లెస్సగఁ బలికినాఁడు.

విదు—(తనలో) ఎంతకష్ట మెంతకష్టము.

ద్రౌప—ఓహో! సభ్యులారా! విధికృతమున యుధిష్ఠిరుఁడు జూదమున నన్నోడిన నోడుఁగాక! దుర్మాతుండగు దుశ్శాసనుఁ డీసభకు నన్నీడ్చుకొని వచ్చుట జూచి మీరు సహింతురే! ఇయ్యది ధర్మమగునే!

భీము—(ధర్మరాజునుఁజూచి) అన్నా ధర్మతనూభవ! ధన కనక వస్తువాహనయుత మగు రాజ్యమంతయు నోడితివి. మమ్మోడితివి. వీరు మనల నేమిసేయు దురు? ద్రౌపదిని బణముగా నిడితివే? ఇంత యవివేక మెచ్చట నైనఁగలదా. శకుని కైతవ మెఱంగియు నిట్టి యకార్యముం జేసిన నీ బాహుదాహం బొనరిం చినను బాపములేదు.

అర్జు—అన్నయ్యా! భీమసేనా! శాంతింపుము. ధర్మసంధుఁడగు ధర్మతనూజుఁడు ధర్మముదప్పి వర్తించెనేని, ధరణీచక్రమంతయుఁ దల్లడిల్లును. సుహృద్ద్యూత ధర్మయుద్ధములకుఁ బరులచేఁ బిలువఁబడినప్పుడు విముఖుఁడగుట క్షాత్రధర్మ ముగాదు. కైపడ్డ కర్తవ్యమయిన కార్యమును కేవ్వరు సేయుదురు.

ద్రౌప—(సభ్యులను జూచి) ఆర్యులారా! నాప్రశ్న కుత్తర మనుగ్రహింపరేల?

వికర్ణ—ఓహో! సభ్యులారా! అందఱును నాడువాండ్రను కలిగినవారలే. ద్రౌపదికిం బ్రత్యుత్తరము బలుకరేల? ధర్మసందేహమేదైన వచ్చినప్పుడు దాని వెతఁగి

యుండియు జెప్పకుండుట మహాదోషమని పెద్దలు చెప్పుదురు. మీరందఱును నూరకొనుటచే నేను చెప్పవలసి వచ్చినది. జూదము, పానము, వేట అతిభక్షణాసక్తి యను నీనాలుగు దుర్వ్యసనంబులయందుఁ దగిలి వర్తించువాఁడొకప్పుడు ధర్మము దప్పివర్తించును. అట్టి వానికృత్యములు చేకొనఁదగవు. ఈ ధర్మనందను డకితవాహూతుఁడై వ్యసనమునఁజిక్కి పాండవులకు సాధారణధనమైన ద్రౌపదిని నోడెను. ఈమె యధర్మవిజితన ఏకవస్త్రయగు నీమెను సభకు దెచ్చుట యధర్మము.

కర్ణు—కుమారా! వికర్ణా! ఇంతమంది పెద్దలెఱుఁగని ధర్మము నీవు చెప్పవచ్చితివా? బాల్యవయస్కుఁడవగు నీకీ ప్రశంసయేల? నీవు పాంచాలి యధర్మవిజితయని పలికితివి. ధర్మజుఁడు తన సర్వస్వమ్మును నోడినప్పుడిది వానికి వెలియెట్లగును? కావున నీమె ధర్మవిజితయే. నీవీమెను సభకుఁ దోడ్కొనివచ్చుట యధర్మమని పలికితివి. నీవు చెప్పినమాట సాధ్వీమణులయందు వర్తించును. కాని, యీమెయందు వర్తింపదు. భార్యకు దైవముచే విధింపఁబడు భర్త యొక్కఁడే యుండును. ఈమె కేవురుగలరు. ఇట్టి కులటను విగత వస్త్రంజేసి తెచ్చినను బాపములేదు.

విక—తండ్రి! ఇప్పట్టున నీకెదురు జెప్పవలసి వచ్చినది. ద్రుపదరాజనందని కులటయే యనుకొందము. కులటకైనను మానహానిసేయుట కార్యులు సమ్మతింపరుగదా.

కర్ణు—(ఇంచుక కోపముతో) అనవసర ప్రసంగముగట్టి పెట్టుము.

దుర్యో—(దుశ్శాసనునిఁజూచి) తమ్ముఁడా! దుశ్శాసనా! పాండవుల వస్త్రముల చ్చుటఁ బెట్టింపుము.

(పాండవులు తమపై వస్త్రములదీసి యొకచోట నుంతురు.)

దుర్యో—ఇంక ద్రౌపది వలువగూడ నొలువుము.

భీము—(తనలో) ఎంతకష్టము కన్నులారఁజూడ వలసివచ్చినది.

దుశ్శా—(ద్రౌపదిని సమీపించి) ద్రౌపదీ! నీ వలువ యచ్చటఁబెట్టుము.

ద్రౌప—హా! ఎంతదురంతము! పాండవేయులారా! మీభార్యనైన నన్నొక దురాత్ముండు వేణిబట్టి నిండు సభలోని కీడ్చుకొనివచ్చుచుండ మీరందరును జూచి యూరకుందురా? భుజబలసముద్రులయిన మీరు శౌర్యముదక్కి చిత్రప్రతిమలవలెఁ జూచుచుందురా? ఈసభయందీ దుశ్శాసనుని వారింపఁగల సమర్థులే లేరా? పాపాత్ములను బరధన పరకాంతాపహారణాసక్తచిత్తులను దండించుట పాపమని తలంచితిరా? ఇట్టి పాపకృత్యముల సేయుచున్న వారిని దండింపకున్నచో నింక నన్యాయమె ధరాతలము బాలించునుగదా! హరిహరీ! [illegible]

వాయునందనా! యమగదాదండసన్నిభమగు నీగదాదండమునకు దుప్పు వట్టినదా! ఓ పాండవమధ్యమా! అగ్నిహోత్రునిచే నొసఁగిన గాండీవ మేమైనది? మాదేశ్రీయులారా! మీపౌరుషము లెందడంగినవి?

భీము—(ద్రౌపదినిఁ జూచి)

మ. తరుణీ! సంగరరంగమందు రిపులన్ ♦ దర్పంబునం జేర్చుచుఁ
గురుధైర్యంబునఁ జెండఁజాలెడి మహా ♦ కోదండపాండిత్యముఁ
గరిమన్ గల్గియు నూరకుండవలసెన్ ♦ గాదే! లతాంగీ యుధి
ష్ఠిరభూపాలుని శాంతభావమునకున్ ♦ స్వాంతంబునం జంకుచున్.

మ. చంచద్ఘోరగదాభిఘాతములచే ♦ శత్రుక్షమాపాలహృ
త్పంచప్రాణములన్ హరించి భవదు ♦ ద్వంధంబు వారింతు నో
పాంచాలీ! వెతగుందకే! పవనజ ♦ ప్రఖ్యాత విక్రాంతిచే
వంచింపంబడకున్నె వైరినృపతి ♦ వ్యాపాదసంపాదనల్.

ధర్మ—(ద్రౌపదినిఁజూచి) పాంచాలాధిప తనుజా! నీ పతులయందు శౌర్యహీను లెవ్వరును లేరు. అందఱును జతుర్దశభువనము లొక్కపెట్టున నెత్తివచ్చినను జయింపఁగల సమర్థులే. ధర్మపాశబద్ధుడనైన నన్నుఁ జూచి వీరందఱును నూరకొనిరి. కాలక్రమమున నీకెగ్గొనర్చిన దుర్మతులు వీరిచేఁ బడుదురు గాక! అకారణముగ నాగ్రహము గలిగించుకొని, యిట్టి దారుణవాక్యములచే వీరికి రోషముగలిగింపక నాధర్మసంధత గాపాడుము. ధర్మతనూభవుఁడు నిరంతరధర్మమూర్తియను యశోడిండిమము భూనభోంతరాళముల మ్రోయఁ జేయుము. ఇప్పట్టున నీకు సర్వలోకశరణ్యుఁడైన శ్రీకృష్ణభగవానుఁడే శరణ్యుఁడగుఁ గాక!

ద్రౌప—మహారాజా! పరాభవదవాగ్నింబడి యొడలు తెలియక యేవో కొన్ని లరచితిని. నన్ను మన్నింపుము. మీ ధర్మసంధతకు నేనెన్నఁడును భంగమొదవించుదానను గాను. దుర్మతులగు కౌరవులచే నిట్టి పరాభవమందినను, ధర్మమునకు వెఱచి యుధిష్ఠిర భూపాలుఁడు శాంతి వహించెనను మీకీర్తి వల్లిక సర్వదిగంతములఁ బ్రాకుగాక! నాపరాభవమునకుఁ దగిన ప్రతీకారము కాలక్రమమున మీరు చేసెదీరుదురని నాకు నమ్మకము గలదు. నిండుసభలోనికి నాశిరోజములు బట్టి యీడ్చికొనివచ్చిన దురాత్ముండగు దుశ్శాసనుఁ డుగూలువరకును నా వేణిని ముడిచికొనను.

దుశ్శా—ఈ ప్రతిజ్ఞ కేమిలెమ్ము. వలువ విప్పి యిచ్చుటఁ జెట్టుము. (వలువ లాగుచున్నాఁడు)

ద్రౌప—(కృష్ణుని నుద్దేశించి) హా! కృష్ణా! ద్వారకావాసా! నాకు జరుగుచున్న యీపరాభవమును నీవు జూచుచు నూరకొనుట పాడియా? నీవు నన్ను సభ

ద్రికంటె నెక్కువ యనురాగముతోఁ జూచుచుందువు కదా! ఆపద్బాంధవా! ఈ యాపద బాపుము. భుజబలపరాక్రమవంతులైన పతులు ధర్మపాశబద్ధులై నా బన్నము దప్పింపలేక యుండిరి. ఇప్పట్టున నీవు తప్ప నాకు శరణ్యమెవ్వరును లేరు. ముకుందా! రక్షింపుము.

దుశ్శా—ఎదుటనున్న పతులు రక్షింప లేక పోయిరి గాని, యింక వెట్టిగొల్లడగు కృష్ణుఁడా నిన్ను రక్షించువాడు.

(చీర లాగుచున్నాఁడు.)

ద్రౌప—(తప్పించుకొనుచు కృష్ణుని నుద్దేశించి)

మ. మొరయాలింపుము మానమున్నిలుపవే! ♦ మూఢాత్ములౌ కౌరవుల్
పరిభావింపుచు నున్నవారు, కృపతో ♦ బాలించి రక్షింపవే
శరణం బెవ్వరు లేరు గావగను ని ♦ చ్చన్ గొల్తునిన్నెప్డు; సుం
దర పీతాంబర మాధ వాచ్యుత ముకుం ♦ దా! దీనరక్షామణీ.

దుశ్శా—(వలువ విప్పగా మఱియొక వలువ యుండును.) ఏమిది! రెండు చీరెలు గట్టితివా యేమి? (మరల లాగుచున్నాడు.)

ద్రౌప—హా! కృష్ణా! నన్ను రక్షించుట కిదియే సమయము. దుశ్శాసనుం డిట్టి యకార్యము సేయుచుండగా వలదని యొక్కడైనఁ గురుసభయందు వారింపక యున్నవాడు. దేవా! నీ సోదరినగు నన్ను రక్షింపుము.

# దండకము.

శ్రీరుక్మిణీనాధ లోకైకనాథా యుమానాధసంస్తోత్ర బృందారకేంద్రస్ఫురచ్చారుకోటీరమాణిక్య నీరాజితాంఘ్రిద్వయా, యద్వయా, యవ్యయా, చిన్మయా, నిన్ను వర్ణింప నేనెంతదానన్ గృపావార్ధివై నా మొరాలించి రక్షింపవే, శిక్షితానేకదైత్యా సనుంగాక వేరెవ్వరిన్ వేడ, దిక్కెవె యంచెంచి ప్రార్థించుచున్నాను, నీసోదరిన్ నన్ను గావడవే, ధర్మభూపాలుడీ రీతినిన్ మాయజూదంబులో రాజ్యమున్ సంపదల్ సర్వమున్ గోలుపోయెన్; దురాత్ముల్ విరోధుల్ కౌరవుల్ నాయెడన్ దుష్టబుద్ధిన్ బ్రవర్తింపుచున్నారు; మత్ప్రాణకాంతుల్ మహావీరులై యుండియున్ ధర్మపాశంబునన్ బద్ధులై యేమియున్ సేయగాలేకయున్నారు; నేదాంతవేద్యుండనౌ నీవె కారుణ్యమున్ బూని, బన్నంబు దప్పించుచున్ మానభంగంబు గాకుండ రక్షింపవే నన్ను; దీనరక్షామణి మున్ను గంధేభనాథుండు గ్రాహంబుచేఁ జిక్కి, కష్టంబు వారింపవే యంచు నేకాగ్రచిత్తంబుతో నిన్ను వేడంగ; సత్ప్రేమనుం బూని నీరాటమున్ ద్రుంచి మత్తేభమున్ బ్రోవవే, తండ్రి, భక్తాళినిం బ్రోవ, నీ కంటె దైవంబు లేరెందు, నీకెప్డు మాయందు పక్షంబటంచున్ జనుల్ జెప్పు వాక్యంబు సత్యంబె యౌనట్లుగా నేలుమీ నన్నుఁ గృష్ణా నమస్తే నమస్తే నమః.

మ. బలమున్ గల్గియు నూరకుండిరిటు మ ♦ త్ప్రాణేశ్వరుల్ ధర్మ బ
ద్ధులుగా నుండుట చేత నీవయిన దో ♦ ర్దో నన్ను నిప్పట్ల నీ
విలసద్భవ్యకటాక్షవీక్షణముల ♦ వీక్షించి రక్షింపుమీ
చలమున్ బూనక దాసురాలఁగద కృ ♦ ష్ణా! దీనరక్షామణీ.

దుశ్శా—యేమిది! వింతగా నున్నది. ఇన్ని చీరెల నెట్లిమిడ్చి గల్గితివి? (మరల లాగు చున్నాఁడు)

ద్రౌప—హా! కృష్ణా!

శా. గంధేభేంద్రుఁడు నీరుద్రావఁగ మహా ♦ గ్రాహంబు తత్పాదముల్
బంధింపన్ ధృతిదూలి ముక్తికితరో ♦ పాయంబు లేకే జగ
ద్బంధున్ నిన్నుఁ దలంపఁ జక్రమున న ♦ వ్వైరిన్ మహోద్దగ్ర గ
ర్వాంధుం ద్రుంచి గజంబుగాంచితివి కృ ♦ ష్ణా! నన్ను రక్షింపవే.

దుశ్శా—(చీరెలాగి యథాప్రకారముగ నుండుట జూచి) అబ్బా! ఈమె వలువ లొలుచుటకు నాకువిసుగు జనించుచున్నది. ఇంక నేను విప్పజాల. (ద్రౌపదిని జూచి) ఇన్ని వస్త్రములున్న నీవేకవస్త్రనని పలికితివే?

భీష్మ—(తనలో) శ్రీకృష్ణభగవానుఁ డీమెయెడలఁ బ్రసన్నుఁడై రక్షించినాఁడు. (అందఱును వినునట్లు)

ఉ. ఏనును ద్రోణుఁడున్న ఫల ♦ మేమి? కటా యిటదుష్టబుద్ధినిం
బూనిన యాత్మజాతునకు ♦ బుద్ధిని జెప్పకనన్నునున్ మఱిన్
ద్రోణుని ద్రోసి పుచ్చెను బు ♦ ధుల్ ముదమందగ నిద్ధరాజమున్
బూనివధింపఁ గావలెను ♦ మూర్ఖుని యంధనృపాలు నిప్పుడే.

(కత్తిదూసి ధృతరాష్ట్రునిమీదికి పోబోవును.)

విదు—మహాత్మా! గాంగేయా! కురుకులమునకు వినాశకాలము సమీపించినది. నీవేల తొందరపడెదవు.

ధృత—విదురా! ఏమి! ఈ కలకలము. ఏమి జరుగుచున్నది.

భీము—(కోపముతో) ఓయీ! అంధనృపతీ! నీకుఁ గన్నులు లేవుగాని చెవులువినరాకున్నవా! ఇంతవఱకును ద్రుపదరాజనందని యేడ్చిన యేడుపే వినఁబడలేదా. ఎంత మాయకాడవు. (సభ్యులంగాంచి)

మ. పరమ ప్రాభవధర్మ శీలయగు నీ ♦ పాంచాల పుత్రిన్ నిరా
దరమున్ జేసి యవస్థఁబెట్టిన దురం ♦ తస్వాంతు సైరింపఁగాఁ
దరమే వైరిశిరో విఖండనసము ♦ గ్యద్విక్రమాటోప బం
ధుర తేజోవిభవైక శీలికిని శ ♦ తృవ్యూహనిర్మూలికిన్.

మ. కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనే ♦ కుల్ జూచుచుండంగ, దు
ష్కరుఁడై ద్రౌపది వల్వలొల్చిన జనున్ ♦ గారుణ్య హీనాత్ము; నా

కురురాజానుజు దుస్ససేను నుసురుల్ ♦ గొల్పుచ్చి వేవేగ న
ద్వరవక్షస్స్థలరక్తబిందువుల నా ♦ స్వాదింతు నుగ్రాకృతిన్.

ఇందుకు దప్పితినేని పితృపితామహులగతికి దప్పిన వాడనగుదును. (ద్రౌపదిని జూచి) ఓ పాంచాలరాజతనయా! భవదీయ కేశాంబరాకర్షణమహాపాతకుం డైన దుస్ససేనుని వధించిన చేతులతో నీశిరోజముల నేను స్వయముగా ముడివేసెదను. అంతవఱకును నీవు వేణిని ముడుచుకొనవలదు.

ద్రౌప—(సభ్యులం జూచి) సభ్యులారా! ధర్మవర్తనులారా! పాంచాలధరాధీశ్వరుం డగు ద్రుపదునకుం గూతురనై భరతకులాలంకారులగు పాండవులకు ధర్మపత్నినై ముకుందునకుం జెల్లెలనైన నేనిట్టు లీ నిండుసభయందుం బరాభవ మందందగిన దాననేనా? దీనింజూచి మీరూరకుందురా? నేను వీరికి దాసినా? దాసినే యగుదునుగాక! ఇట్టి పరాభవమేల నాకుం గూర్పనలయును?

భీష్మ—సాధ్వీమణీ! ద్రుపదరాజనందనీ!

తే. గీ. బ్రదికియుండియుం జచ్చిన ♦ వారిమాడ్కి
ద్రోణుండును నేను నుంటిమి ♦ తోయజాక్షి
యేమి యనుకొంటివో గాని ♦ వృద్ధనృపుడు
కలుష చిత్తుండు మిక్కిలి ♦ కపట గుణుండు.

ఈ ధర్మసందేహము మమ్ముదీర్పుడని యేలకోరెదవు. ధర్మమూర్తి యగు ధర్మతనూభవుండే చెప్పవలెను. పరాభవమొందితినని నీవు కుందవలదు. నీ కావంతయుం గొఱంత సంభవింపదు. ఈపుర్ణయదుగోదరమే కురువంశనాశనభూజమునకు బీజమై యొప్పును.

కర్ణు—(ద్రౌపదిం జూచి) ఉమ్మడిగొడ్డు విధమున నిందఱపతులతో నేమి సౌఖ్యము గాంతువు? తగినవానిని వేరొకనిం జేకొని సుఖింపుము.

దుర్యో—(తనతొడపైం గూర్చుండమని ద్రౌపదికి సైగజేయును.)

భీము—(కోపముతో)

తే. గీ. మహిత ధనరాజ్యసంపద ♦ మదము నంది
సుగుణరత ద్రౌపదికిం దొడ ♦ జూపినట్టి
కలుషచిత్తు పెనదొడల సం ♦ గ్రామమందు
బొడిగ జేయగ శపథంబుం ♦ బూనినాడ.

(దుర్యోధనుని మీదికి పోబోవును.)

భీష్మ—వత్సా! శాంతింపుము.
అర్జు—అన్నయ్యా! శాంత చిత్తుఁడవుగమ్ము.
ద్రోణు—భీమసేనా!

తే. గీ. కౌరవకులంబు మన్నన ♦ గలియ నిట్టి
దుర్ణయ దురోదరమొదవె ♦ దోర్బలంబు
జూపసమయమే! యిది; ధర్మ ♦ సూతి ధర్మ
గౌరవముల నిల్పుము మమ్ముఁ ♦ గాంచితయెన.

ధృత—(తనలో) అక్కటా! నాకుమారుని దుష్టబుద్ధికి నేనేమని వగతును? (దుర్యోధనుని విలోకించి) వత్సా! దుర్యోధనా! నీకు వయస్సు హెచ్చిన కొలఁదిని దుష్టబుద్ధులు హెచ్చుచున్నవి. కులశీలములఁ బరికింపకఁ నయోనిజయుఁ పాండవధర్మపత్నియు నగు ద్రుపదరాజనందనికిట్టి పరాభవముగూర్తువా? నీవు భరతవంశము మాపుటకుఁ బుట్టితివని తోచుచున్నది? (ద్రౌపదింగాంచి) అమ్మా! పాంచాలీ! ఎఱిఁగియో యెఱుంగకనో నీయెడల నెగ్గుసలిపిన నాసుతుల దోషముల మన్నించి, భవదభీష్టమెట్టిదో చెప్పుము. చేయుటకు సిద్ధముగనున్నాను.

ద్రౌప—నాకు వరంబొసంగ నీకిష్టముండెనేని ధర్మనందనుని దాస్యమునుండి విముక్తుఁ జేయుము.

ధృత—అమ్మా! అది యిచ్చితిని. వేరొక వరము గోరుకొనుము.
ద్రౌప—ధర్మతనయుని నలువురు తమ్ములును తమతమ యస్త్రశస్త్రములతో దాస్య విముక్తులగున ట్లనుగ్రహింపుము.

ధృత—అట్లేయగుగాక! ఇంకొక వరము గోరుకొనుము.

ద్రౌప:—దేవా! క్షత్రియాంగన రెండువరములకే యర్హురాలు.

ధృత—అట్లయిన మూడవవరము నేనిచ్చెద. నేడు ద్యూతమున ధర్మనందనుఁ డోడిన సమస్తసామ్రాజ్యమును నాతని కిచ్చివేసితిని. నీవు నాకు దుస్సలవంటి దానవు.

శకు—(జనాంతికముగా దుర్యోధనునితో) కుమారా! పడిన శ్రమయంతయు వమ్మైనదికదా!

దుర్యో—నాతండ్రి నాప్రయత్నముల కన్నిటికిని భంగము గలిగించు చున్నాఁడు. కానిమ్ము. ఈసారి మరల జూదమునకు బిలచి యం దోడినవారు పండ్రెండు

వత్సరము లరణ్యవాసమును, నొకయే డజ్ఞాతవాసము సేయునట్లుగను బం
దెము వేసి యాడుదుము.

కర్ణు—ఇదియొక తీరు బాగుగనే యున్నది. కాని,

చ. సమరమొనర్చి శాత్రవుల ♦ సంపదలన్ హరియింపఁగల్గుటే
క్రమమగు నట్టిమార్గము జ ♦ గంబున నందఱు మెత్తురిద్ది; నీ
దు మదిని శంకవీడి కడు ♦ దోర్బలశాలుర పాండుపుత్రులన్
సమరమునందు గెల్వ నను ♦ జయ్యనబంపుము కౌరవాగ్రణీ.

శకు—అది ప్రారంభమునందే సేయఁ గూడదు. ఇక్కడ మనముంటిమేని ధృతరా
ష్ట్రుని కృత్యమునకు సమ్మతించిన వారమగుదుము రండు.

(దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు నిష్క్రమింతురు.)

ధృత—(ధర్మరాజుం జూచి) ధర్మనందనా!

తే. గీ. నీవు ధర్మసంఘుఁడవు; మీ ♦ రాప్తులైన
నా సుతులు మీయెడల జేసి ♦ నట్టి దుష్కృ
తంబులెల్లను మరచి మ ♦ దంబు మీఱ
రాజ్యముం గొని సుఖింపు మీ ♦ రమ్య చరిత.

నా కొమరులయెడ బగ మరచిపొమ్ము.

ధర్మ—తండ్రి భవదాజ్ఞ శిరమున ధరించెదఁగాక!

భీము—అన్నయ్యా! నీ పెట్టి యేమి?

ఉ. తమ్ములులేరె వారకని ♦ చెప్పము శౌర్యములేదె; యేల రా
జ్యమ్మును స్వీకరించెదవు ♦ జాయకృపాపరిలబ్ధమిద్ది; ధ
ర్మమ్మిది కాదు సుమ్ము; సమ ♦ రమ్మున శత్రుశిరంబులెల్ల, ని
క్కమ్ముగ ద్రుల్లనేసి, యన ♦ ఘా! మనరాజ్యము దెత్తు నమ్ముమీ.

అర్జు—అన్నయ్యా! వాయునందనా! ఇప్పు డామాటయేల. ద్రౌపది కరుణవలననే
మనకు రాజ్యము మరల వచ్చినదని తలంపనేల. పెదతండ్రి యనుగ్రహమే
యని తలంప గూడదా!

ధర్మ—తమ్ముడా! భీమసేన! తండ్రియాజ్ఞకు మనము బద్ధులమై యుండవలయును.

ద్రోణు—(ధృతరాష్ట్రునిఁజూచి) మహీపాలా! ఇప్పట్టున నీవు చేసినపని కడుఁజక్కఁగ నున్నది. (ధర్మరాజుంజూచి) ధర్మతనయా! గతజల సేతుబంధమునకు విచారింపవలదు. మీపెదతండ్రి మీయెడల గృపవహించినాడు. నీవు తమ్ముల తోడను ద్రౌపదితోడను నిండ్రప్రస్థపురమున కరిగి యథాప్రకారముగ సుఖింపుము. ఇంకనేమి కావలయు.

ధర్మ—గురువర్యా! ఇంకఁ గావలసిన దేమున్నది.

—* మంగళమహాశ్రీ *—

భూతలమునఁ బ్రజలు ♦ భూరి సుఖముల్ గనుచు
పుణ్యమతులై వెలయుఁగాతన్
నీతముగ వర్షములు ♦ నేలఁబడగా నెపుడు
నిండు ఫలమిాయుత పొలంబుల్
ఖ్యాతిగను రాజునెడ ♦ గాంచుత జనంబు లతి
గౌరవము భక్తిననిశంబున్
నేతయు సుధర్మగతి ♦ నిట్లొలగకే పుడమి
నిట్ల సతము నేలు తతిరక్తిన్.

సంపూర్ణము.



శ్రీరస్తు.
శుభమస్తు.

# ద్రౌపదీవస్త్రాపహరణము

## పాటలు.

(నాటకప్రారంభమున సామాజికులందరు కలసి తెరలోపాడెడి ప్రార్థనపాట)

1 కళ్యాణిరాగం—ఆదితాళం.

ప॥ శ్రీ. ల. క్ష్మ్మి. నాయకా - క్షీర. పారావార, నివాసకా ఖగనాయక -
జయ జయ జయ॥శ్రీల॥

అ॥ప॥ లీలామానుష విగ్రహానిగ్రహానుగ్రహ ప్రకటాగ్రహ ఖలనిగ్రహ॥శ్రీల॥
వాలాయముగ భవత్పాదపద్మములను సదానమ్మిన
బాలకులము-నేటిదినము - ద్రౌపదీవ - స్త్రాపహరణ ఖేలన -
జేయగన్ -గోరికతోనిను
మేలుగలుగజేయ మాకుసహాయపడగ గోరితిమోదేవా॥శ్రీల॥

(కామపాల జయంధరుల ప్రవేశమున కామపాలుడు పాడెడిపాట.)

2 కమాచిరాగం—ఏకతాళం.

ప॥ జయంధరా ఓ జయంధరా - మాటమాట నీకేటికితొందర॥జయం॥

అ॥ప॥ రయంబుగను జనుచుంటివి అరయగ - రాజుగారికొల్వుకూటమునకా
భయంబునొందక, నాయందు, దయతో
నయంబుగను సంశయంబుదీర్పుము
నయనోత్సవముగ పురమేలయుండె॥ జయం॥

(నారదునిజూచి ధర్మరాజు పాడెడిపాట.)

3 సురటరాగం—ఏకతాళం.

ప॥ వందనమిదెగొను నారదమునివర్య - భక్తజన యూథమునినాథా॥వంద॥

అ॥ప॥ డెందమూ నందమునొందెను దేవాభవ్య దివ్యదర్శనమునమావా
రందరు ధన్యులై వర్ధిల్లెదరని
పొందుగన్ - దేవర -సుందర-పాదంబుల కిదె॥ వంద॥

(ధర్మజునితో నారదుడు సంభాషించు సందర్భమున పాడెడిపాట.)
4 బేహాగ్ రాగం—ఏకతాళం.

ప॥ ఆకర్ణింపుము నిర్మలసద్ధర్మచారిత్రి గుణపవిత్రి॥ ఆక॥
అ॥ప॥ లోకసుందరయనీ కసాధ్యకార్యముల్ వి
లోకింపగావశమె నిజముగ॥ ఆక॥
నీకు నాల్గుభుజములవలె - నీతమ్ములు నల్వురుండ
నేకాననకృష్ణుని నిరుపమానపూర్ణకరుణ
సాకీ॥ మీయందువరలుచుండె॥ఆక॥
సకల మహీఖండలాఖండసామ్రాజ్యపూజ్యతా ధురీణా
అఖిలధర్మాధర్మనిర్మాణపర్వసద్గుణాభరణా
మిశ్రి॥ శ్రీకరమగు - రాజసూయము - మహాధ్వరము - సల్పుమా
మీకు జయమునమ్ముమా॥ ఆక॥

(శ్రీ కృష్ణదర్శనముగూర్చి ధర్మరాజు పాడెడి పాట)
5 బ్యాగ్ రాగం—ఏకతాళం.

ప॥ అహో యేమినాభాగ్యము - నేంట్రసుదినము
అ॥ప॥ బహ్మకుమారుడు సనురాజసూ
యము జేయుమనీకేజయమగుననిచన ॥అహో॥
ఆహా వనమా యేకరణేని నేనీకార్యమునకు నిర్వహింతునోయని
తహతహమనిమది తల్లడపడుచుంటిరి దర్శనమిచ్చె సాక్షాద్విష్ణువు కృష్ణుడు ॥అ॥

(రాజసూయమొనరింప ధర్మజు నుత్సాహపరచి పాడెడిపాట)
6 కమాచి రాగం—ఆదితాళం

ప॥ నీవింక నిశ్శంకనుపినుమా - నీకుసాటి - మేటినృపులే - యవనిగలరె -
ధర్మనందనా ॥నీవింక॥
అ॥ప॥ యేవిధిగ - యిట్టికార్యము - జేయగల్గుదున్ - యనుచుసందియం
బావంతయుమదినొందక ధైర్యమువహించి కార్యముసాధింపుమా ॥నీవిం॥

(భీమార్జునులతో కృష్ణుడు జెప్పెడిపాట)
7 సురటరాగం—ఏకతాళం.

ప॥ భీమార్జునులారా - వినుడదె - గోరథ - మనుపర్వతము ॥భీమా॥
అ॥ప॥ మీ మానసంబు లలరగ గనుడదె - మించివెల్గుచున్నదే గిరివ్రజపురి
అదియేస్థిరుడు జరాసంధునిపురంబు నేత్రానందకరంబు ॥భీమా॥

అర్జు- - స్వామీనీ - చరియు - నెంతయో - వింతగా శ్రీకృష్ణపరమాత్మా.

(జరాసంధుడు ప్రవేశించుచు పాడెడిపాట)
8 పూరికల్యాణిరాగం—ఆదితాళం.

ప॥ ఏమిమాయయో నేడహా - నామది పరిపరివిధముల చెదరుచుండె ॥ఏ॥
అ॥ప॥ ఈరోజు నేజన్మించినబాది - యీనాటివరకు యెన్నడెరుంగని
వామనేత్రమదరుచుండుట అద్భుతంబుగానె ॥ఏమి॥
యేమహాఘోరమైనను పోడిగ - కేయగలననే సహజధైర్యము
ఏమూలకరిగినోగద తెలియుడు- యీనాటి మాయ కేమనుకొనుజగతిని॥ యేమి॥

(శ్రీకృష్ణజరాసంధులు డైలాగ్ పాట)
9 శ్రీరాగం-ఏకతాళం.

కృష్ణు—ప॥ ఓజరాసంధ నాపలుకులాలకింపుమా
అ॥ప॥ సాజముగను - స్నాతకులము - తేజముగను - నీకరులము
రాజధర్మముగ నీవు ...చ్చితి మాకతమున నీపూజలు - గైకొన - కుంటిమి
॥ఓజరా॥
జరా— ఏమేమి - మీపలుకు - లమితవింత గొలుపుచుండె
యీమహిమున్నె నృపులు మిముగాంచియెరుగ నదిగాక యేమీ మీరు
వైరినా
కృష్ణు— నీమదమున - నేమరవున - నీవిధమున బల్కెదవే ॥ జరాసం ॥

(శ్రీకృష్ణ భీమార్జునులతో జరాసంధుడు వచించెడిపాట)
10 కమాచిరాగము—ఏకతాళం.

ప॥ కొండలనైనను - కరములనిడుకొని - చెండులవలెనాడించు - ను
అ॥ప॥ దండిబలుండగు జరాసంధుండని ధర్మజుడాత్మను నెరుంగడే ॥కొండ॥
దుండగుం - డచలగురూరు... - యుండెడివాడట యనుచుబంపెగా
రండిదెమీరలు గాడీలోకము యేకీభవించియుండినగ యుండెదరణ
మందునిల్చి ॥కొండ॥

(భీమునితో జరాసంధుడు రణమొనర్చు సందర్భమున జరాసంధునిపాట)
11 బ్యాండు ట్యూను.

ప॥ ఇదే తెగినసమయమగును మనకు తగును భోరగానిలన్॥ ఇదే॥
అ॥ప॥ కదనమునకు సమముల ప్రదేశమిదిగో గనుమాభీమా॥ ఇదె॥

గుదమునర్ - కదలుమా - కదనమున్సల్పుమా
పదపద నాహృదయంబు - పరిపరివిధములనుండే॥ ఇదె॥

(శిశుపాలుడు కృష్ణుని కర్ఘ్యంబిచుటకు సమ్మతింపక పాడెడిపాట)
12 శ్రీరాగం—ఏకతాళం.

ప॥ అహాహా యేమిఘోరమిది - కృష్ణుకు పూజార్హుండట॥ అ॥
అ॥ప॥ మహామహులు మానీంద్రులు ♦ మాన్యులైన భూసురులు
మహారాజులీ సభయం దెందరోగల్గియుండ
సాహసించి యీ - భీష్ముడు వచియించుచుండె వినుడు॥ అహా॥

(శిశుపాలునితో ధర్మరాజు జెప్పెడిపాట)
13 బేహాగ్ రాగం—ఏక తాళం.

ప॥ వలదువలదు జనవలదు త్వరపడజనదు సుశీలా శిశుపాలా॥ వలదు॥
అ॥ప॥ అలుకవహింపక వినునావలుకులు - అవనిన్ గనగన్ - పూరుషజన్మకు -
శాంతమేగదా విభూషణంబు॥ వలదు॥
ఫలమేమీ మీపగలవలననిట పవిత్రచరిత్రుడా శ్రీకృష్ణు
బలుకరాని - బలుమాటలుబలికెదు - పరమేశ్వరావతారుకు జూ॥ వల॥

(భీష్ముడు కృష్ణుడు పూజార్హుండని వచింప శిశుపాలు డాగ్రహమున పాడెడిపాట)
14 సిం॥ కమాచిరాగం। ఆదితాళం.

ప॥ హీనుని కృష్ణునిగొనియాడుటకై నీకొకనాలుక చాలకున్నది
అ॥ప॥ ఈనా ఖరాసికిదె నీనాలుక వేయిచీలికలుగాజేతున్॥ హీను॥
యేనాడైన నీ గొల్లన్ - పూజార్హుగా - గా నిడిరే
యీనాటికి యీభీష్మాచారి నిర్ణయించె గొల్లనిపూజించుట
సహదే— మానవజన్మంబెత్తినవాడు మాధవచంద్రుని కర్ఘ్యంబిచుట
అనర్హమనినర్ నాలుకగోతును శౌర్యధనులు వహ్వారేయనంగ
శిశు— రా నా మ్రోలకు మిట్టిపడకుమా
సహ— ఈ నా కాలను మట్టుబెట్టెదో

(కృష్ణునిజూచి శిశుపాలుడు పాడెడిపాట)
15 మోహనరాగం—ఆదితాళము

ప॥ మిడిసిపడకు మిడిసిపడకు నీకుధర్మజుండు అర్ఘ్యమిడినయంత నే॥ మిడిసి॥
అ॥ప॥ చెడుకాలము సమీపించె - చెనటీ దిగురణమునందు
గడచిగట్టెక్కితినని గర్వపడకు గర్వపడకు॥ మిడి॥

(దుర్యోధనుడు మయుసభాభవనమును జూచిపాడెడిపాట.)

16 జంఝూటి రాగం—ఏకతాళం.

ప॥ అహెూ కనుల కానందముగా - గన్పడు యీభవనము గనుకన్గొ॥అ॥

అ॥ప॥ ఓహెూ హెూ। ఆహాహా
మహీస్థలిని నిదివరకెన్నడు నేనిట్టి రమ్యభవనము గనిమెరుగా
మహాసుదినమిది - మహానీయుడగు। మయునిర్మాణ ప్రి। వీణతగంటిని

(శకునితో దుర్యోధనుడు వచించెడిపాట.)

17 హిం॥ మఃఖారిరాగము. ఆదితాళం.

ప॥ మాతులా నాసంతాపమునకు గతము నీతోనేనేమనందు హా నే॥ మాతు॥

అ॥ప॥ ఎంతోసంతోషముగ జని - వింతైన మయుసభగని
స్వాంతమునకా - వెరపొంది - అమితముగన్ - ముదమొందితిగాని
ధృతరాష్ట్ర మహారాజ పుత్రుడనై బుట్టి
ధృతిచెడి ధాత్రిన్ - బ్రతుకనానుదుటన్ - వారిసెను గాంచిలును హా-
టకగర్భం - డోహూమా॥

(ధృతరాష్ట్రునకు దుర్యోధనుడు జెప్పెడిపాట)

18 కమాచిరాగం—ఏకతాళం.

ప॥ జనకావిను - నను దయనుగనుగొనుమా యిదేమనవిజేతు ॥జన॥

అ॥ప॥ కనుగొనపాండువుల్ వైభవచందము
మనకంటెయధికమై - మహిని వెల్గుచుండె ॥జన॥
వినుతేర్పారాజులను గొప్పయేమికవివిధరాజులు ధర్మజునింగని
వినుతించిరికడు - కానుకలొసగిరి ॥జనకా॥

(సందర్భానుసారముగ ధృతరాష్ట్రుడు పాడెడిపాట)

19 ఆనందభైరవిరాగం—ఏకతాళం.

ప॥ తనయుంసువినయా - తగునాతగవరివై యా తెగువుగ నీమదిబూనగ ॥త॥

అ॥ప॥ వినరా పెరవారా నాయనుజునిబిడ్డలుగారా
గననీకుమాత్రములేరా - సోదరులుగారా ॥తన॥
కనుగొనకృష్ణునిసత్కృపపూర్తిగ గల్గివర్ధిలుచు ధరణినంతట
ఘనకీర్తినిగొని మనెడిపాండవుల ఘనమునీమదిని సహింపవా ॥తన॥

(దుర్యోధనునితో సంభాషించు సందర్భమున శకునిపాడెడిపాట)

20 శ్రీరాగం—ఆదితాళం

ప॥ సంతసంబు సంతసంబు సంశయంబునొందకు రాజాధిరాజా॥

అ॥ప॥ చింతవీడుమికజూడు - సుంతయు వెనుదీయక
అంతరంగమందు చింతనొంద పాండునందనుల
వింతగాను ద్యూతమాడి విభవమంతనోడింతు రాజాధిరాజా ॥సంత॥

(సందర్భానుసారముగా విదురుడు పాడెడిపాట)

21 మోహనరాగం—ఏకతాళం.

ప॥ ఎంతదారుణ మెంతదారుణ మెట్టిదురాలోచన యోదుర్యోధనుడు॥

అ॥ప॥ ఎమంతవిషపు హృదయుడయ్యె - సుంతయు గనికరములేక
వంతగూర్ప ధర్మజుసిరులు- ద్యూతమునగ-దోచుకొనగ-దలచెహా॥ఎంత॥

ధృతరాష్ట్రుండైన సుతుని - దుష్టబుద్ధి వారింపక
కృతకృత్యుండవై రమ్మని - కృపగ - సుతుగ - బంపెనట ॥ఎంత॥
(ధర్మజునింగని దుర్యోధనుడు పాడెడిపాట)
22 కేదారగౌళరాగము—ఏకతాళం.

ప॥ సోదరా - సోదరా - మీరాక - నాకెంతో
సంతోషము గొల్పెమదిని॥ సోద॥

అ॥ప॥ ఓధర్మనంద నా యీసభామందిరంబు మా
తన నిర్మితముసుమా బాగుగా దిలకింపుము
మోదముతో శిల్పాచార్యులు దీనిని నిర్మించె ॥సోద॥
ఆదెస దిలకింపుము - దగద్ధగిత రత్నఖచిత,
స్తంభసహస్రములుగలిగి
విరాజుల్లు - ఆద్వార - ప్రదేశమును -
గనుగొనుమా ॥సోద॥

(ద్యూత మాడకూడదని దుర్యోధనునితో ధర్మరాజుచెప్పు సందర్భమున పాడెడిపాట)

23 కాఫీరాగం—ఏకతాళం.

ప॥ అనుజా విను భూధవులకు ధరయందము
నాడుట బాడియె నీమదిబాగానూహింపు

అ॥ప॥ మనలో మనకేనా కలతలు గల్గించెడియాట ॥అను॥
ఘనులెవ్వరైన గణియింతురె ధర
ద్యూతమాడు యేమహారాజునైనగ
గానననగ - మిన్నించు - మనమాడక - జనమునుసుమా ॥అను॥

(ధర్మజునితో దుర్యోధనుడు జెప్పెడిపాట)

24 సురటరాగం—ఆదితాళం.

ప॥ చాలునులే - చాలునులే, ధర్మజ నీసరసమిట్లు
పరిణమించెనా ॥చాల॥

అ॥ప॥ మేలుమేలు నేనెంతో మోదముతో మీతోడ
కాలముగడుపుటకై మిముగోరిబిలువ ద్యూతమాడ
మేలుగాదని - వీలు లేదని - మిక్కిలి నీతులు -
బల్కెదవే॥ చాలు॥

(దుర్యోధనునితో వికురుడు బల్కెడి పాట)

25 హిం॥ తోడిరాగం—ఆదితాళం.

ప॥ మనవిసేవినుమయ్యా - మది నించుక యోచింపుము రాజా

అ॥ప॥ కనుగొన మాయాద్యూతమునాడగ కల్పించి
ధర్మజు నొప్పించి

అన్యాయంబగు నాటలనాడి వారి సర్వశ్రీనోడింతువే॥ మనవి॥

దుర్యో— కనులకుగంతలు కట్టితివా అన్యాయ మటంచు పచించెదవే
జనుజనుమా నీవచోగరిమవిన బాగుబాగు
నగుబాటగువిదురా ॥మన॥

(ద్యూతమాడుసందర్భమున ధర్మరాజు పాడెడిపాట)

26 యమునాకళ్యాణిరాగం—ఆదితాళం.

ప॥ హాశతధృతీ - విధీమమ్మలన్ - యింకెంతజేయ దలంచితో ॥హాశత॥

అ॥ప॥ హాసర్వసంపదలు రాజ్యసర్వస్వము
నానహోదరుల నోడజేసితివి ॥హాశత॥
యీసమయంబున నొప్పటకరయగ
కాసైనగాయిక గానగరాదే॥
ఓసర్వేశ్వర కృష్ణ భగవానుడా
నీసత్కటాక్షమేయిక మాకుదిక్కు ॥హాశత॥

(దుశ్శాసనుడు ద్రౌపదిని సభకు దెచ్చుచుండగా ద్రౌపది దుశ్శాసనులు పాడెడిదైలాగ్)

27 కేదారగౌళరాగము—ఏకతాళం.

దుశ్శా—ప॥ ఓద్రౌపది నీపతులేవ్వరు మాకుభృత్యులై
దాసులై ॥ఓద్రౌ॥

అ॥ప॥ సద్ద్యూతమునందు నిన్ను మాకొడగానవలెమ్ము
వేగమేరమ్మా తడయక త్వరగరావమ్మా॥ ఓ ॥

ద్రౌపది—ఓ దుశ్శాసన నీకిదితగునా శ్రేయంబగునా
నీ దౌర్జన్యము స్త్రీనగు నాయెడలన్ బూనతగునా

దుశ్శా— సాధుమతిని త్వరగరమ్ము దౌర్జన్యమేమి బూనుటేమి

ద్రౌపది—సాధ్వినిసుమి సాధ్వినిసుమి

దుశ్శా— ఓద్రౌపది నీపతులేవురు మాకుభృత్యులై దాసులై

(సభను దిలకించి ద్రౌపది పాడెడిపాట)

28 శ్రీరాగం—రూపకతాళం.

ప॥ లేరే ధర్మాధర్మవిదులు - యీసభన్ • అరయన్॥ లే॥

అ॥ప॥ కూరుండై దుశ్శాసనుండు - యీనిండుకొల్వునకు
యీరీతి నిర్భీతితోన్ - గొనిరాగా - ఒక్కరైనా
తగదనరే

ధీరుల్, వీరుల్, రణశూరుల్ నాపతులు - నన్నుఁగని
మిన్నకున్నారే॥ లే॥

(శకుని మాయాద్యూతముదలచి భీముడు పాడెడిపాట)

29 హంసధ్వనిరాగం—ఏకతాళం.

ప॥ పాపముగాని - కోపమురాని - నాపరితాపము
నోపగలేనిక - నా బాహుదర్పమిపుడు

అ॥ప॥ జూపెదనానంద - మొందన్నృపులింగు • భళిభళి
యని ధన్యులిడ॥ పాపము॥

ఆపరిపంధి శకుని -అఘమని యెంచక నృపుని -
ప్రాపున జేరి మాకిట్టియాపదలు ఘటింపజేసెహో ॥పాప॥

30 (ద్రౌపదిని వస్త్రమును విడుపుమని దుశ్శాసనుడు పాడెడిపాట)

ప॥ విడువిడు తడయక పడతీద్రౌపది నీవలువను
విడియిందిడుమా

అ॥ప॥ కడుగడువయ్యెను చూడగ తడయగనేటికి
వచింపు నిశ్శంకగ ॥విడు॥
కడుబలుడౌ - నీపతులిం - దుండిరనా - నీయూహ
బిడియము పడకుము వేవిధముల మదితల్ల
డించినను తప్పదుజూ ॥ విడు॥

(సందర్భాను సారముగ ద్రౌపది పాడెడిపాట)

31 బ్యాగ్ రాగం—ఏకతాళం.

ప॥ శ్రీధర తాపసేంద్ర హృద్విహారీమురారీ - శేషశా
యీ సిరిమనోహ్లాయి శౌరీ ॥శ్రీధ॥

అ॥ప॥ మాధవారమాధవా - దివ్యప్రభావ - మాన్యస్వభావ దేవదేవ॥
యీ ధరణీభరము బాపగ దశావతారధారుండవౌ దీనబంధూ
యీదుర్మార్గుడు - దుశ్శాసనుడు - యించుక గొంకకనన్ను
బాధించుచుండె బరికింపుమునను - నీసత్కృపను
యీ సమయమునను॥ శ్రీధ॥

(సందర్భానుసారముగ ద్రౌపది పాడెడిపాట)

32 బేహాగ్ రాగము—ఏకతాళం.

ప॥ శ్రీకృష్ణ పరమేశ్వరా - సాక్షాద్విష్ణూ॥ శ్రీకృ॥
అ॥ప॥ నీకృపజూప రావేమీ స్వామీ సర్వాంతర్యామీ॥ శ్రీకృ॥

ఈ కౌరవపాంసనులు - యీ కృత్రిమస్వాంతులు
లో కఠినత్వము బూని - నావలువ లొలువదొడగ॥ శ్రీకృ॥
నీకరయన్ సహోదరిన్ యీపరిభవమెంచగన్
నీకుగాదె లోకరక్షకా - నీరజాక్షు॥ శ్రీకృ॥

(సందర్భానుసారముగా ద్రౌపది పాడెడి పాట)

33 యమునాకల్యాణిరాగము - ద్విపదతాళం-

ప॥ గోకులభూషణా గోపాలకృష్ణా

అ॥ప॥ ఓ కృపాకరా నీసహోదరిన్ ద్రౌపదిన్ గానా॥ గో॥
ఈ కుటిలాత్ముడు, దుశ్శాసనుడు
నాకోకనొలువ - జంకు నెనన్నా॥ గోకుల॥
నీకుగాదా - లోకనింద - సోదరినగునన్ - బ్రోవకున్నన్
జాగుసేయకికన్ - త్వరగన్ - రమ్మునన్ - ఈతరిన్
బ్రోవగన్॥ గోకుల॥

34 కళ్యాణిరాగం ద్విపదతాళం.

ప॥ దీ,న,జనా,వనా, దరణా భరణా, సేవా,దేవాదిదేవా ఓవాసుదేవా

అ॥ప॥ ఓనందనందనా, దీనన్ ననుబ్రోవరావా నీవేగావామాకు

సాకీ॥ శ్రీనీలమేఘ తను విలాస ప్రకాశ కౌస్తుభమణిభూషణా
ఓనాగతల్పా, భవత్ కల్పితా మహాప్రపంచమున యిట్టి
దుష్కల్పితంబుల్ వికల్పంబు సల్పసమర్థుండవీవుగాదే కృష్ణా

మితా్ర॥గానసన్ - సత్ కృపతో యీతరిన్ గాచివలువలొసగి
దుష్టుడైన - దుశ్శాసనుని - మర్ధి - గోవర్ధన - నిన్నే
మదినర్చించితి ॥దీన॥ ంపుము -

(సభ్యజను లందరు కలసిపాడెడి జయహారతిపాట)

35 పూరికల్యాణిరాగం—ఏకతాళం.

ప॥ జయహారతినీకిదె ముదమునగొను జగజ్జనని సర్వసద్గుణఖనీ

అ॥ప॥ భయహారిణి శాంభవి సురతరుణీమణుల మధుల
విహరించు శర్వాణి॥ జయ॥
నయవినయవిధేయతతో నిన్నుమది - నమ్మి
యున్న నీభక్తులమగు మము
దయతోబ్రోవుము ఆయురారోగ్యసంపద
లిడి సత్కీర్తిని జెలంగ॥ జయ॥

